శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## Journal of the Telugu Academy

KAKINADA





దేశభాషలందు తెలుగు లెస్స

సంపుటము ౫౦
Vol 50

సంచికలు ౧-౨
Parts I & II

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

స్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు:

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు
(జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు,)

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA**

సంవత్సరము చందా 3—0—0

సంపుటము ౫౦ శార్వరి-మార్గశిర పుష్య, సంచికలు ౧-౨

Vol 50 మాఘ ఫాల్గుణములు Parts 1 & 2



## సంపాదకీయము.

ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రికకు, నేఁటికి నలుబదితొమ్మిది వత్సరములుగడచినవి. ఏఁబదవయేట అడుగుపెట్టినది. నేఁటి ఆంధ్రసారస్వత పాఠకలోకములో వెనుకటి తరమువారికేఁగాక యీ తరము వారికి ప్రాచీనసాహిత్యసంప్రదాయముల నెఱుకసేయుట ఈపత్త్రికకుప్రధాన విషయము. దానికై శక్తివంచన లేకుండ ఈ ప్రత్త్రిక శ్రమించుచున్నది. గ్రాంథికాంధ్రభాషాసముద్ధారమునకై యింత కాలము నిలువఁద్రొక్కుకొని సేవచేయుచున్న పరిషత్సంస్థను నిలుపుకొనుట. ఆంధ్రులందఱకు నవశ్యకర్తవ్యముగావున, ఈపత్త్రికకు పాఠకలోక మిత్రోధికమైన ఆదరాభిమానములను ప్రదర్శింతురుగాక యని ప్రార్థించువాఁడ.

ఇట్లు,

సంపాదకుఁడు

# విషయసూచిక



---

# మార్కండేయ పురాణము—మారన

రచయిత: శ్రీ పెద్దిభొట్ల వేంకట సాయినాథశాస్త్రి గారు, బి.ఏ., ఆనర్సు.
ఆంధ్రభాషోపన్యాసకులు, మహారాజాకళాశాల, విజయనగరము.

సంస్కృతమునందలి యష్టాదశపురాణములలో నొకటియై వెలసినది మార్కండేయపురాణము. ఆంధ్రీకరించిన కవి మారన. మారన కవిబ్రహ్మయు, నుభయకవి మిత్రుఁడు నని పేరుగాంచి, కవిత్రయములో నొకఁడుగా వెలసిన తిక్కనసోమయాజికి శిష్యుఁడు. మారన తండ్రిపేరు సయితము తిక్కనామాత్యుఁడే. నియోగిబ్రాహ్మణుఁడు. కాలము క్రీ. శ. 14 వ శతాబ్దముగాఁ జెప్పనొప్పును. ఈ యాంధ్రకృతి కృతిపతి—ప్రతాపరుద్ర ధరణీపతికి సేనానియు, ఏకశిలానగర పాలకుఁడు నగు గన్నయ్య. మారన యితర కృతులెవ్వియు నెఱుఁగరావు.

సంస్కృతమునందు—

"సర్గశ్చప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశానుచరితంచేతి పురాణం పంచలక్షణ"మ్మని పురాణలక్షణము నిర్వచింపఁబడియున్నది.

"సర్గ మన్వంతర ప్రతిసర్గములును
సకల నృపవంశ వంశానుచరితములును
ననగ నెంతయు నొప్పు నీయైదు లక్ష
ణములఁ బొలుపొంది ... ..." మార్కండేయ పురాణమున్నదని మారన పీఠికయందే సూచించినాఁడు. సర్గమనఁగాఁ బ్రపంచోత్పత్తికి సంబంధించిన విషయ వివరణము—అనగా బ్రహ్మాదు లోనర్చెడి సృష్టిప్రకారము; ప్రతిసర్గమనఁగాఁ బ్రళయము. వంశమన దేవాసురుల వంశక్రమము; మన్వంతరమ్మన మనువులకు సంబంధించిన చరిత్ర; వంశానుచరితమన సూర్య చంద్ర వంశోద్భవులగు రాజుల

చరిత్రలుండును. ఈ పురాణ లక్షణములకుఁ జతుర్థాశ్వాస మాదిగాఁ గల యాశ్వాసములను లక్ష్యముగాఁ జెప్పవచ్చును.

మార్కండేయమహాముని కడకు వేదవ్యాసుని శిష్యుఁడగు జైమిని యరుదెంచి-"బహు విశేషంబులనుల్లసిల్లునట్టి భారతాఖ్యానం బునందు గూఢతరములైన సమంచితార్థంబు లెఱుఁగఁదలఁచి వచ్చితి" నని తన యాగమనమునకుఁగల కారణమును విన్నవించుకొని, యతని యాదేశమున వింధ్యపర్వతమునందలి ధర్మపక్షులయొద్దకుఁబోయి వారి వలన సంశయ నివృత్తి యొనర్చుకొనినాఁడు. తరువాతఁగూడ జైమిని యనేకవిషయములను గూర్చి ప్రశ్నించుటయు, ధర్మపక్షులు వివరించుటగా గ్రంథమంతయు సాగిపోయినది. మార్కండేయ పురాణము గద్య పద్యోభయాత్మకమగునట్టి కృతి. ఎనిమిది యాశ్వాసముల గ్రంథము.

మార్కండేయపురాణమునం దాయా స్థలముల వివరింపఁబడిన యుపాఖ్యానములలో హరిశ్చంద్రోపాఖ్యానము, అలర్క చరిత్రము (కువలయాశ్వ చరిత్ర), స్వారోచిమను చరిత్రము, మహిషాసుర సంహారము, వత్సంధ్ర చరిత్రము, అవేక్షిత చరిత్రము, మరుత్త చరిత్రము మొదలగునవి ముఖ్యములు. మార్కండేయ పురాణమునందలి యితివృత్తములనే యాధారముగా గ్రహించి చాలమంది యర్వాచీను లగు కవులు కావ్యరచన కుపక్రమించినారు. అట్లు గ్రహింపఁబడిన వానిలో హరిశ్చంద్రోపాఖ్యానము, కువలయాశ్వచరిత్ర, స్వారోచిష మనుచరిత్రము మున్నన్నఁదగినవి. 'అసలు' మారనయే మార్కండేయ పురాణమునం దాదిలోనే -

"...నూతన కథా విస్తారమై యోగ్యమై
చండాఘౌఘోత్కర హారియై పరమ విజ్ఞానాశ్రయంబైన మా

ర్కండేయాఖ్య మహాపురాణము ..." అని యీ పురాణమునకుఁగల ప్రత్యేకతలలో "నూతన కథా విస్తారమైన"దని మున్ముందుగాఁ బేర్కొనినాఁడు.

ఇందలి హరిశ్చంద్రోపాఖ్యాన గాథకును, తరువాత వెలసిన హరిశ్చంద్రోపాఖ్యానముల యందలి గాథకును బోలిక తక్కువ. ఇందు హరిశ్చంద్రుఁడు వేఁట కేఁగి యట నాడుఁగూయి వినవచ్చి తద్రక్షణార్థమై పోవుచుండ, నటనున్న విఘ్నేశ్వరుఁడు —
"ఈ రాజుఁ బ్రేరేచి యీ మునిరాజు నెద నొవ్వఁ బలికించి యీతని క్రోధమూలముగఁ జేసెద నంత నీవిద్యలు లజ్జిఁ బడ కేఁగు" నని నిశ్చయించి హరిశ్చంద్రు నావేశించినాఁడు. తన్మూలముగా హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రునిచేఁ బడరాని పాట్లుపడినాఁడు. ఇట్లున్నది యిందలి కథా ప్రారంభము. అర్వాచీన కృతులలో దేవేంద్రుని సభయందు వశిష్ఠ విశ్వామిత్రులు హరిశ్చంద్రుని సత్యనిష్ఠనుగుఱించి వివాదము లొనర్చి ప్రతిజ్ఞ లొనర్చినారు. అదికారణముగా విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని బాధింప నుంకించుట మొదలగు వానితోఁ గథాప్రారంభము. ఇట్టివే మఱికొన్ని భేదము లున్నవి.

మారన మార్కండేయ పురాణము నందలి మరుత్తుని కుమారుఁడగు నరిష్యంతునియొక్కయుఁ బౌత్రుఁడగు దమునియొక్కయుఁ జరిత్రము తెలపనో యుపేక్షించినాఁడు. మారన యాంధ్రీకరణము మాతృకకుఁ జేరువగా నుండునని పెద్దల వక్కాణ! ఆ విషయ ముభయ గ్రంథములను బరిశీలించినఁగాని తేలునట్టిది కాదు.

మారన రసపోషణమునందుఁ దన ప్రతిభను బ్రదర్శించినాఁడు. ఆయా సందర్భములందుఁ దత్తదుచితముగా రసపోషణ మొనర్చినాఁడు. కథాంశముల విలువలను బోసియుక రసపోషణ గావించుట యీతని యలవాటు. అందుల కుదాహరణముగాఁ గలవానిని గొన్నిటిని బరి

శీలింతము. శృంగారరసపోషణ సందర్భమునం దంగ ప్రత్యంగ వర్ణనలఁ జేయుట యర్వాచీన కృతులందు సాధారణముగాఁ గానవచ్చును. అట్టి యతివేలమగు శృంగారవర్ణనమునఁ బడక యుదాత్తమగు పద్ధతియందే యిందలి వర్ణనలు సాగిపోయినవి.

కరుణరసపోషణ :— హరిశ్చంద్రోపాఖ్యానమున కుమారుఁడు మరణించిన సందర్భము :—

"ఉరగముచేతఁ జచ్చిన తనూద్భవునిం గని శోక వేదనా
పరవశయు న్వికీర్ణ కచభారయు నుద్గత బాష్పపూరయు
న్కరతలతాడి తాస్యయును గద్గదికా వికలార్తనాదయు
న్జరణ విపర్యయాపగత సత్వరయానయు నై పొరంబొరిన్"
'బోరనఁ బొంగి శోకరసపూరము నిర్భర బాష్పపూరము
ల్వారక కన్గవం దొరుఁగ వాతెఱలాలలు గ్రమ్ముదేర హా
హారవము ల్సెలంగ విరియంబడి వేనలి ధూళిఁ బ్రుంగ న
క్కూరిమిపట్టిఁ జేర్కొనుచుఁ గోమలి మేదిని జేతులూఁదుచున్"

భీభత్సరసపోషణ — కౌశికుని యాకారవర్ణన :—

'కరచరణాంగుళుల్మ్రురిగి గాత్రము తద్దయు వ్రస్సి చీము నె
త్తురు దొరఁగంగఁ బెన్మురికి దుస్సహమై సుడియంగ ఘర్ఘర
స్వర మెసఁగంగ నీఁగ లనిశంబును జుమ్మని మూఁగుచుండ హే
యరసము మూర్తమైన యటు లాతత కుష్ఠ రుజాభిభూతుఁడై."

ఇట్లే మిగిలిన రసములును బోషింపఁబడినవి. వర్ణనలు స్వభావోచితముగా నుండి సమపాళ్ళములో సాగిపోయినవి.

గౌరన బహుముఖ ప్రజ్ఞాచతురుడైన కళాస్రష్ట. పాత్రచిత్రణమునందు సైతము నందెవైచిన చేయి. ఏపాత్రకాపాత్రయే చక్కఁగాఁ దీర్చిదిద్దినాఁడు. తన ప్రతిభాప్రదర్శనమున కవకాశముగల సందర్భములందు సైతము సంక్షిప్తముగనే యూరకొనినాఁడుగాని, పురాణోక్తమగు పరమ ప్రయోజనమునకు భంగము గలిగింపలేదు.

గ్రంథరచనయందు విషయావిష్కరణమునకు సంబంధించిన రచనాపద్ధతిని శైలియని యందురు. ఇది వ్యాఖ్యానశైలి, వర్ణనాత్మక శైలి, నాటకీయశైలి యని త్రివిధములు. పురాణోచితమైనది వ్యాఖ్యానశైలి. కావ్యములలో వర్ణనాత్మక శైలియు, నాటకములందు నాటకీయశైలియు నుండును. అట్లని పురాణములలో నితరమగు శైలి యుండరాదని గాదు—ప్రధానముగా నది కనుపట్టునని యర్థము. మార్కండేయ పురాణమునందాయా పట్టులందాయా శైలీ ప్రభేదములు గానవచ్చినను బ్రధానముగా గనుపట్టున దాఖ్యాన శైలియే. తనకుఁ బూర్వులగు నన్నయ, తిక్కనల రచనారీతుల నామూలాగ్రముగ గుర్తెఱింగిన వాఁడుగనే కనుపట్టును మారన. సంస్కృతాంధ్రపద ప్రయోగములం దీతని లేఖని నిరాఘాటముగా, బయనించినదేగాని తబ్బిబ్బు వడలేదు. కవితాధార కుంటువడుటయు లేదు. పద్యము మూసలో పోసినట్లుండి, యేక సమాసఘటిని బంచకళ్యాణి పరువు లెత్తినట్లు హృద్యముగ నుండుట మఱియొక విశేషము :—

"ఆగంధర్వుఁడు నప్సరోంగనయు నత్యాసక్తిమైఁ గూడి హై
మాగస్ఫార దరీగృహాంతర లతాంతాగార భాస్వత్తటీ
భాగీరథ్యురు సైకతస్థలజల ప్రాంత ప్రదేశంబుల
న్భోగింపంగఁ దొడంగి రంగజ సుఖాంభోరాశి నిర్మగ్నులై."

ఇఁక నింకలి వర్ణనలఁ బరికించిన—వీలైనంతలో సంక్షిప్తముగఁ పఠితల హృదయ స్పందనము గలిగించునట్లు లెన్నియో వర్ణనల నొనర్చినాఁడు. అట్టివానిలో నొకటి శ్మశానవర్ణనము ఆంధ్ర సాహిత్యమునందు శ్మశానవర్ణనమొనర్చిన కవులసంఖ్య బహుస్వల్పము. వారి కందఱకు మార్గదర్శకుఁడు మన మారన కవియే యై యుండునని నా తలంపు:—

'‘శవదహనోద్భూత సంతత ధూమంబు
        బహువిధ దుర్గంధ బంధురంబు
కేశ చితాభస్మ కీక సంకీర్ణంబు
        భేతాళ డాకినీ భూత చితము
వాయస గృధ్రగోమాయు కలకలంబు
        మేదో వసా మాంస మేదురంబు
మృత బంధు శోకార్త సతత హాహారవ
        మమితకపాల పిండాన్నసాంద్ర
ముజ్జ్వలాగ్ని శిఖావృత వ్యోమభాగ
మగుచు నత్యంత విస్తారమైన భీక
ర శ్మశానమ్ముగని ... ”

చిత్రకారుఁడేమైన నేమేని తబ్బిబ్బునొంది కొన్ని విశేషములను మఱచిపోవును. మారనవంటి మహాకవి పఠితల మనోనయనముల ముందెట్టి క్లిష్టచిత్రములనేని విన్యసింపఁజేయఁ గలఁడు. మారన యీ కళయందు సిద్ధహస్తుఁడే యనవచ్చును. 'అసలు' కొన్ని విశేషములను చిత్రకారుఁడు చిత్రింపఁజాలఁడు. అట్టివానిలో వాసన, శబ్దములు ముఖ్యములు. అట్టివానిని సైతము కవి విస్పష్టమగు రీతిని విన్యసింపఁ జేయఁగలఁడు. ఇదియే కవికిని చిత్రకారునకునుగల ముఖ్య భేదము. వర్ణనలయందే మఱియొక ధోరణి :—

“కాంచనాలంకృతిఁగర మొప్పి నీమ్రోల నేతెంచు గజఘటలెందుఁబోయె
గనక కింకిణుల చెల్వొనఁగ్రాలు తురగంబులేల పికిలుఁకుల నేఁగుదేవు?
రత్నోజ్జ్వలములైన రథములు నీపజ్జవడిఁ జనుదేర కెక్కడ నడంగె?
వివిధాయుధ స్ఫూర్తి వెలుఁగు కాల్వురమొత్తమేల నీతోరాక
        యేఁమియయ్యె ?

రమ్యభూషణ దివ్యాంబరములు దొఱఁగి। నారచీరలుగట్టి యనాథవృత్తి
నాలుఁగొడుకును వెంటరానరుగునట్టి। యెడరు వాటిల్లెనే మేదినీశ! నీకు!"
పూర్వ పరిస్థితికిని యప్పటిపరిస్థితికిని గల భేదము స్పష్టముగాఁ బరి
తలకు వివరింపఁబడి రసానుభూతి కలుగుటకుఁ గారణమగును. ఇట్టి
వర్ణనా పద్ధతియే యాంగ్లమున "Method of Contrast" అని
చెప్పఁబడినది. ప్రౌఢపదగుంభనము, భావప్రాగల్భ్యములు మారన
వర్ణనలోని ప్రత్యేకతలు.

మార్కండేయ పురాణమునందు ధర్మశాస్త్ర ప్రసంగ మధిక
ముగాఁ గానవచ్చును. తత్త్వోపదేశము, రాజనీతి, కర్మసిద్ధాంతము,
యోగప్రకారము, స్వప్నములు, రకరకముల నరకములు మొదలుగాఁ
గలవిషయము లనేకములు వర్ణితములైనవి.

మారన మార్కండేయ పురాణమునందుఁ గవి సమయములను
జమత్కరించి గ్రంథమునందలి యాయా ఘట్టములను సౌందర్య సుభ
గములుగా నొనర్చినాఁడు :—

"ఆ నగుమోము చెన్ను శశియందును బంకరుహంబునందు లే
దా నయనప్రభాతి మదనాస్త్రములందు మెఱుంగులందు లే
దానును మేనికాంతి లతికావలియందుఁ బసిండి యందు లే
దా నలినాయతాక్షి లలితాకృతి నామదిఁ బాయనేర్చునే."

సాత్త్విక శృంగార రసపోషణ! ముఖమును జంద్రునితోడను,
బద్మములతోడను బోల్చుటయుఁ గన్నులను మదనాస్త్రముల
తోడను మెఱపులతోడను బోల్చుటయు, శరీరమును లతలతోడను,
బంగారముతోడను బోల్చుటయు గవి సమయములుగాఁ బ్రసిద్ధి నంది
నవి. కాని యిచ్చట నాయిక యతిలోక సౌందర్యవతి యగుటచే నా
యుపమానములు నైతము నిరర్థకములుగాఁ జేర్కొనఁబడినవి. అట్టి
యామె లలితాకృతి యాతనికేకాదు—రసికహృదయుఁడైన వానిహృద
యమునుండియే తొలఁగిపోవదనుట నిస్సంశయము. వికారములగు
వర్ణనలొనర్పని మారన యెంతటి సంయమనశీలియో చిత్తగింపుఁడు.

ప్రౌఢకవి మల్లన తన రుక్మాంగద చరిత్రములో మారనకవి యొనర్చిన నరకవర్ణనమునే యనుసరించుటయు, నాంధ్రకవితా పితామహుండని పేరుగాంచిన యల్లసాని పెద్దనార్యుఁడు తన మనుచరిత్రమున మారన మార్కండేయపురాణము ననుసరించుట మూలమున, మారన కవిజన సంభావ్య కవితా విభాసురుఁడని తలంపవచ్చును.

ఆంధ్రజాతీయతా స్ఫోరకములగు — "అజ్యముః వోసినదిచ్చు" "కన్నులనిప్పులురాల", "చిమ్మచీఁకటి", "మీఁద మిన్ను విఱిగి కూలుట", "గుండెలవియుట", "తంగేటి జున్ను", "అడవి గాచిన వెన్నెల" మొదలగు పలుకుబడులను సందర్భోచితముగాఁ బ్రయోగించినాఁడు. ఇది పురాణమగుటచే సుహృత్సమ్మితముగాఁ బతివ్రతా ధర్మములు మొదలు రాజధర్మములవఱకు ననేక విషయములు సర్వజనోపయోగకారులగునవి సరళమగు ధోరణిలో సరసముగా ముచ్చటింపఁబడినవి. కవితాచాకచక్యమునఁ, గథాకల్పనమున, భావనా ప్రదీపనమునఁ గ్రొవాటముగల కవి మారన.

శతావధానులు శ్రీ శేషాద్రి రమణకవులు ప్రస్తావనలోఁ బేర్కొనినట్లు :—

"మారన గొప్ప లాక్షణిక కవి. కవిత్వము సరళముగ శ్రావ్యముగ దేశీయములతో నిండియుండును. రసపోషణ సంధానమున నీ కవి తనలేఖినిని మనోభావ ప్రకటనమునకే వినియోగించు చుండును. మొత్తముమీఁద నీకవి కథాంశములఁ గ్లుప్తముసల్పి సముచితములగు వర్ణనలకుఁ దావొసంగి కావ్యనిర్మాణ మొనరించుటలో మిగుల నేరుపు గలవాఁడు. వర్ణనాంశములకంటె కథాంశములకే యీకవి విలువగల తన కావ్యమునఁ దావొసంగును. ఈ యంశమునను నీతఁడు తిక్కన సోమయాజి శిష్యుఁడని చెప్పఁదగినవాఁడే!"

ఇతి శివమ్.

# విజయనగర సామ్రాజ్యము:

## సంగమవశంరాజులు—కడపటివారి వృత్తము.

రచయిత : వీరశైవేతిహాస ప్రవీణ, శ్రీ బి. వి. శ్రీనివాసరావుగారు,
M. A. M. R. A. S. తుముకూరు, మైసూరుస్టేటు.
(చరిత్రోపన్యాసకులు, శరణ బసవేశ్వర కళాశాల గుల్బర్గా)
అనువాదకులు : బండారు తమ్మయ్య.

అవతారిక :-విజయనగర సామ్రాజ్యస్థాపకులయిన సంగమ వంశరాజులు శైవమతీయులనియు, కురుబ (గొల్ల, యాదవ) కులమునకుఁ జెందినవారనియుఁ జరిత్రజ్ఞుల నిర్ణయము. కాని నాపరిశోధనము ప్రకార మీవంశమందలి కడపటిరాజులు రెండవ దేవరాయలు, మల్లికార్జునరాయలు, మూఁడవ విరూపాక్షరాయలు (క్రీ. శ. 1419 మొదలు 1487 వఱకుఁ బరిపాలించినవారు) వీరశైవులు (లింగాయతులు) అయియున్నారు. అనఁగా నీకురుబవంశపురాజులు మొదట సామాన్యశైవులయినను దరువాత వీరశైవమతమును స్వీకరించినవారు. ఇందుకాధారములు.

1. శాసనాదికములు (1) మైసూరు ఆర్కి-యాలిజీ డిపార్టుమెంటు డైరక్టరు కీ. శే. శ్రీ ఆర్. శ్యామాశాస్త్రిగారు 1923 సంవత్సరము మైసూరు ఆర్కి-యాలజి రిపోర్టు 91 పుటలో నె 92 రుగాఁ బ్రకటించిన శాసనము. ఇది షిమోగా జిల్లా, అనంతపుర హుబ్లిసోరబు తాలూకా, కొంగిగపుర గ్రామమందలి వీరభద్రేశ్వరాలయముయొక్క యావరణములో నొక రాతిపయిని జెక్కఁబడియున్నది. దానికాలము క్రీ. శ. 31-12-1419 నకు సరియగు శకసంవత్సరము 1340 విళంబి పుష్యశుద్ధ పూర్ణిమాభానువాసరము. ఈశాసనమునే తర్వాత డాక్టరు శ్రీ ఎస్. శ్రీకంఠశాస్త్రిగారును విమర్శించియున్నారు. దీనిలో 6 వ పంక్తిలో రెండవదేవరాయలకు (ఇతఁడే ప్రౌఢదేవరాయలు) "వీరశైవాగమ సారసంపన్న" బిరుదముండినట్లు చెప్పఁబడినది. కాఁగా

నీతఁడు వీరశైవమతీయుఁడనుట విస్పష్టము. (శ్రీకంఠశాస్త్రిగారు ఇండియన్ ఆంటిక్వరి నె 57 రు వాల్యూము 77-85 పుటలలో 1928 సంత్సరము మేయినెలలో ప్రకటించిన వ్యాసము చూడఁదగును.) పూర్వోక్తశకవత్సరము 1340, రాబర్టు స్యూయలుదొరగారి సిద్ధాంతములననుసరించి యీక్రిందివానికి సరియగును. 1. కలియుగ వత్సరము 4520 2. చైత్రాది విక్రమశకము 1476 3. వంగదేశీయ సూర్యసిద్ధాంత (మేషాది) వత్సరము 825 4. కొల్లముదేశ శకము 593-593 5. క్రీస్తుశకము 1418-1419 A. D. 6. జోలియన్‌శకము ఉత్తరదేశ సంప్రదాయ ప్రకారము విళంబివత్సరము; దక్షిణదేశ సంప్రదాయప్రకారము విశ్వావసు సంవత్సరము

(2) ఎపిగ్రాఫియా కర్ణాటిక 15 వాల్యూము అరసీకేరి జిల్లా, నె 238-239 రు కన్నడ శాసనములలో రెండవ దేవరాయలకు నంజప్ప, మూరురాయ బసవశంకరసెట్టి నాయకులను కుమారులు గలరని యుదాహరింపఁబడినది. ఈ నామములు వీరశైవ సంబంధికములై యున్నవి.

2. పౌరాణికాధారములు : విరూపాక్షపండితుఁడు రచించిన కన్నడ చెన్నబసవ పురాణములో రెండవదేవరాయలు తన కొమరితను వీరశైవ జంగమస్థలమునకుఁ జెందిన వీరన్న వొడయరువకు వివాహము చేసినట్లు చెప్పఁబడినది. (చెన్నబసవ పురాణము పుటలు 758-759. కాలజ్ఞాన సంధి 60, పద్యములు 19,21 చూడుఁడు)

3. చారిత్రకాధారములు : క్రీ. శ. 1672 లో రచితమయిన భైరవేశ్వర కావ్యకథాసూత్రరత్నాకరము, క్రీ. శ. 1650 లో రచితమయిన గురురాజచరిత్ర, క్రీ.శ. 1763 లో రచితమయిన చోరబసవరాజచరిత్ర, అను గ్రంథములందు రెండవదేవరాయలు చామరసు రచించిన కన్నడప్రభు లింగలీల గ్రంథపఠనమునఁ గలిగిన యభినివేశ

మున వీరశైవమతమును స్వీకరించెనని చెప్పఁబడినది. (రావుసాహెబ్ హాయవదనరావుగారి మైసూరు గెజటీరుమూఁడవభాగము చూడుఁడు.)

4. నాణెముల యాధారములు: రెండవ దేవరాయల కాలము నాఁటి నాణెములపయి నంది, నీలకంఠ, వృషభముల ముద్రలు గాన నగును. అవి వీరశైవమత సంబంధిత చిహ్నములు. కావున నాతఁడు వీరశైవమతమును గ్రహించెనని వానివలనఁగూడ నిరూపితమగును. (ఇండియన్ ఆంటిక్వరీ వాల్యూము 57 (మెయి 1928) పుటలు 77-85, వాల్యూము 23 పుటలు 24,25; వాల్యూము 20 పుటలు 301-302 లలో "విజయనగరరాజుల నాణెములు" అను శీర్షికతో శ్రీ E.Hultzch దొరగారు ప్రకటించిన వ్యాసములు చూచునది.)

ఉపసంహారము

పయి యాధారములవలన రెండవ దేవరాయలు వీరశైవుఁడని గ్రహింపఁగలిగితిమి. ఇందువలన నాతని పుత్రులు, తరువాతిరాజులు మల్లికార్జునరాయలు, మూఁడవ విరూపాక్షరాయలుగూడ వీరశైవ మతీయులేయని యేర్పడఁ గలదు. అనంతాచార్య రచితమైన "ప్రపన్నామృతము" అను గ్రంథమున విరూపాక్షరాయలు వీరశైవుఁడని వ్రాసిన యంశములుఁగూడ నీ యూహను బలపఱచును. (డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారు రచించిన "విజయనగర సామ్రాజ్య సంబంధిత గ్రంథాధారములు." అను గ్రంథము చూడుఁడు.

కావున విజయనగర సామ్రాజ్యమును ఇంచుమించుగ 68సంవత్సరములు వీరశైవరాజులు, ప్రౌఢదేవరాయ, మల్లికార్జునరాయ, విరూపాక్షరాయ ప్రభృతులు పరిపాలించినట్లు విశదమగును. విజయనగర రాజుల మతమును నిరూపించుట కీవ్యాసము చరిత్ర పరిశోధకులకు, విద్యార్థులకు నుపకరింపఁగలదు.

---

# శ్రీనాథుఁడు–చంద్రభూషక్రియాశక్తిరాయలు

(బండారు తమ్మయ్య)

ప్రౌఢదేవరాయలు (క్రీ. శ. 1422-1446) కర్ణాటరాజ్యమును బరిపాలించుకాలమున శ్రీనాథమహాకవి చైత్రయాత్రకరిగి యా కర్ణాటాస్థానమునందు బండితకవిగా నుండిన యష్టదిగ్జయ యశోవష్టంభుఁడగు గౌడ డిండిమభట్టారకుని నుద్భట వివాదమున నోడించి యాతని కంచుఢక్కను బగులఁగొట్టించి యాతని కవిసార్వభౌమ బిరుదము నాడిచికొనిన సన్నివేశ మాతని జీవితమందలి యొక సుప్రసిద్ధ సంఘటనము. దీని నా కవిసార్వభౌముఁడు ఘనముగ సంభావించుకొని యుండెను. శ్రీనాథుని చాటువుగా వినవచ్చెడి

"దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషా మహాకావ్య నైషధగ్రంథ సందర్భమునను
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితిసార్వభౌమబిరుదు"

అను చాటుపద్యమును, కాశీఖండ సప్తమాశ్వాసాంతమునఁ గృతిపతి వీరభద్రారెడ్డిని సంబోధించుచు నాతఁడు లిఖించిన

"కర్ణాట క్షితిపాల మౌక్తిక సభా గారాంతరావర్తితా
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్యచారిత్ర"

అను పద్యమును విజయనగరమున రాజదర్శనమునకై వేచియున్న కాలమున రచించిన చాటువులందలి "లక్షణోపేంద్ర ప్రౌఢరాయ క్షితీంద్ర, ప్రౌఢదేవేంద్రరాయ భూపాలవరుని సమ్ముఖమ్మున దయఁజూడుమమ్మ సుకవి" అనుసంబోధనములు నిందుకుఁ బ్రబలనిదర్శనములు. పూర్వోక్తమయిన యుద్భటవివాద సమయమునఁ బ్రౌఢదేవరాయల సమక్షమున మాధ్యస్థ్యమువహించి డిండిమభట్టారకుని కవిసార్వభౌము బిరుదము నాతనికూడఁ దీయించి శ్రీనాథుని కంటఁగట్టించిన పండిత మౌళి, చంద్రభూష క్రియాశక్తిరాయలని పయి చాటువువలన ద్యోతక

మనుచున్నది క్రియాశక్తి పీఠమానాఁడు విజయనగర ప్రాంతములఁ బ్రతిష్ఠితమయిన యొక శైవాచార్యమఠము. ఆ మఠాధిపతులు క్రియాశక్తి ఒడయరులని వ్యవహరింపఁ బడెడివారు.) కన్నడములో ఒడయన్(డు) శబ్ద బహువచనరూపము ఒడయరు. ఒడయఁడనఁగా ప్రభువు. కాఁగా ఒడయుఁడు, రాయఁడు సమానార్థకములు. క్రియాశక్తి ఒడయరుకు సమానార్థక రూపమే క్రియాశక్తిరాయలు. శ్రీనాథునికిఁ గవిసార్వభౌమ బిరుదు పాదుకొల్పిన వ్యక్తి చంద్రభూష క్రియాశక్తిరాయలెవరనునది యిదమిత్థముగ నింతఁదనుకఁ జరిత్రకారులచే నిర్ణీతము కాలేదు. క్రీ.శ. పదిరెండవ శతాబ్దిలో బసవేశ్వరునిచే వీరశైవ మతోద్ధరణము జరగిన కాలమున శైవమతశాఖ లనేకములు వీరశైవమున విలీనమయిపోయెను. పాలకురికి సోమనాథుని ద్విపద బసవపురాణము సప్తమాశ్వాసమందలి యీక్రింది పంక్తు లావిషయమును నిరూపించును. "దేవలకులు, మంత్రదీక్షాన్వితులును, శైవపాశుపతాది శాసనధరులు, వారివారిక లింగవంతులై చూచి, వారివారిక లింగవంతులై కూడి, వీరమాహేశ్వరాచార నిరూఢి, భూరి ప్రసాదోపభోగులై నడవ" పదిరెండవ శతాబ్దికిఁ బూర్వము కర్ణాటాంధ్ర దేశములందు వెలసిన పాశుపత, కాలాముఖ మఠములు చాల వఱకుఁ బదుమూఁడు బదునాలుగు శతాబ్దులలో వీరశైవ మఠములుగా మాఱిపోయినవని చరిత్రజ్ఞులు పలువురు తలంచుచున్నారు క్రియాశక్తిమఠముగూడఁ బ్రౌఢదేవరాయల కాలమునకు వీరశైవ మఠముగనో తిదుపరీమఠముగనో పరిణతమయి యుండునని తలంచుట సత్యదూరము కానేరదు.

చంద్రభూష (శేఖర) క్రియాశక్తి నామాంకితులగు శైవాచార్యులు శాసనములందు వేర్వేఱు కాలములలో భిన్నభిన్నముగఁ గానవచ్చుచున్నారు. బుక్క-రాయ, హరిహరరాయల కాలమున క్రీ.శ. 1349 నాఁటి కొండూరు శాసనములో నొక చంద్రశేఖర క్రియాశక్తి

పేర్కొనఁబడియున్నాఁడు. అతఁడే శ్రీనాథుని కాలమునఁగూడ నుండె నని తలంచుట యెంతగా సంగతము కాఁజాలదు.

1378 నాఁటి వోగటి (మైసూరు రాష్ట్రము)శాసనములో పేర్కొన చంద్రశేఖర క్రియాశక్తి పేర్కొనఁబడుటచే నాతఁడే కొండూరు శాసనమునఁ బేర్కొనఁబడినవాఁడు కాఁదగుననియు, శ్రీనాథుఁడు గౌడ డిండిమభట్టుతో వివదించుటకయి కర్ణాటాస్థానమున కేఁగినది క్రీ. శ. 1406 ప్రాంతమునఁ గొండవీటిలో పెదకోమటి వేమారెడ్డి యాస్థానమున విద్యాధికారిగా నున్నప్పుడు మొదటిదేవరాయల కాలమందయి యుండునని మిత్రులు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు 1945 అక్టోబరు భారతిలో "చంద్రభూషణ క్రియాశక్తి" అను వ్యాసమును బ్రకటింపఁగా నందలి యసంగతులఁ బరామర్శించుచు, శ్రీనాథుఁడు కొండవీటిలో పెదకోమటివేమన, రాచవేమనల పాలనమంతరించినతరువాత, రాజమహేంద్రవరమున అళ్ళయవేమ వీరభద్రారెడ్డుల యాశ్రయ మంది వారిమంత్రి బెండపూడి యన్నయామాత్యుని కంకితముగా భీమేశ్వర పురాణమును రచించిన యనంతరమే క్రీ. శ. 1430-1435 ప్రాంతమున కర్ణాటాస్థానమున కేఁగుచు మార్గమధ్యమున విజయనగరరాజుల యుద్యోగియయిన వల్లభరాయని వినుకొండలోనో మోపూరిలోనో సందర్శించి క్రీడాభిరామరచనమున నాతనికి సహకరించి యుండునని 1946 మెయి నెల భారతిలో "శ్రీనాథుఁడు-చంద్రభూష క్రియాశక్తి రాయలు" అను ప్రతివ్యాసమున సప్రమాణముగ నిరూపించి యున్నాను. శ్రీనాథుఁడు ప్రౌఢ దేవరాయల యాస్థానమున డిండిమభట్టు నోడించి కనకాభిషేక సత్కారమంది, తిరిగివచ్చునపుడు మార్గములో రాచకొండయందు రావు వంశ్యసర్వజ్ఞసింగభూపాలుని సందర్శించినది, భీమఖండ రచనయనంతరము కాశీఖండరచనమునకుఁబూర్వముననుట నిస్సందేహము. అందుఁగూర్చినచర్చ లనవసరము.

ఇక, ప్రౌఢదేవరాయల యాస్థానమున శ్రీనాథ డిండిమభట్టారకుల వివాదమున మాధ్యస్థ్యమువహించిన చంద్రభూష క్రియాశక్తి రాయలు బుక్కరాయలనాఁటి కొండూరు శాసనమునను దాహృతుఁడయిన వాఁడు గాని, క్రీ. శ. 1378 నాఁటి వోగటి శాసనమున నుదాహృతుఁడని శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు తలంచినవాఁడుగాని గాక, క్రీ. శ. 1420-1440 మధ్య శాసనములలోఁ బేర్కొనఁబడిన మఱొక వ్యక్తి కానవచ్చి యాతనికిఁ బ్రౌఢదేవరాయనికి సంబంధమును స్థాపించు నాధారములున్నచో శ్రీనాథునికిఁ గవిసార్వభౌమ బిరుదమును బాదుకొల్పినవాఁ డాతఁడే యైయుండునని నిరూపించుట కభ్యంతరములుండ నేరవనియే నాయభిప్రాయము. విజయనగర సామ్రాజ్యమును స్థాపించిన తొల్లింటి సంగమరాజులు, బుక్కరాయాదులు, సామాన్యశైవ మతస్థులయినను వారివంశ్యులలోఁ బ్రౌఢదేవరాయలు నాతనిపుత్రులు మల్లికార్జునరాయలు, విరూపాక్షరాయలు వీరశైవమతమును స్వీకరించినట్టు లీ సంచికయందే వ్యాసాంతరమున సప్రమాణముగ నిరూపితమయినది. చామరసు రచించిన ప్రభులింగలీలను బఠించినతర్వాతఁ బ్రౌఢదేవరాయలు ముగ్ధుఁడయి వీరశైవదీక్షితుఁడయినాఁడని కర్ణాట విద్వాంసులు పరంపరగా విశ్వసించుచున్నారు. ఆతని మంత్రులు లక్కణ్ణ, జక్కణ్ణాదులుగూడ నాతని ననుసరించిరి. వీరశైవ పంచాచార్య సింహాసనములలో ద్వితీయాచార్యుఁడు దారుకుని (మరుళసిద్ధుని) సద్ధర్మ సింహాసనము బళ్ళారిజిల్లా ఉజ్జినిలోను, చతుర్థాచార్యుఁడు పండితారాధ్యుని సూర్యసింహాసనము శ్రీశైలము, గూళూరు (మైసూరు రాష్ట్రము) నిడుమామిడి (అనంతపురముజిల్లా) అను క్షేత్రములందును నెలకొనియున్నవి. గూళూరునందలి పండితారాధ్యపీఠమునకు సంబంధించిన చరిత్రము సేలముజిల్లా హోసూరు వాస్తవ్యుఁడు పుల్లకవి పండితచరిత్రమను పేరితో క్రీ.శ. 1800 ప్రాం

తమునఁ దత్పీఠాచార్యుల యొద్ద రానురోధమునఁ బ్రబంధరూపముగ రచించియున్నాఁడు. ఆ గ్రంథము నేఁటి సూళూరు మఠాధీశ్వరులచే 1952 సంవత్సరమున బెంగుళూరులో ముద్రింపఁబడి ప్రకటింపఁబడినది. ఆ గ్రంథముచివర నొసంగఁబడిన తత్పీఠపూర్వాచార్యుల పట్టవల్లిరిలో నొక చంద్రభూషణ శివాచార్యునినామము కానవచ్చుచున్నది. అతఁడు పండితారాధ్య పీఠాధీశ్వరుఁడుగా క్రీ. శ. 1433-1450 సంవత్సరముల మధ్యనుండినట్లు తెలియుచున్నది. అతనికి సంబంధించిన శాసనమొకటి నిడుమామిడి మఠములో నేఁటికిని భద్రపఱుపఁబడి యున్నది. దానిప్రతి నీవ్యాసముచివర నుదాహరించుచున్నాను. ఈ పీఠమందలి లేఖ్యములఁబట్టి యీ చంద్రభూషణాచార్యుఁడు తఱచు రాజాస్థానమున విజయనగరమునందే యుండెడివాఁడని తుదకచ్చటనే లింగైక్యమయ్యెనని తెలియుచున్నది. అతని సమాధి యిప్పటికి హంపీ క్షేత్రములో నున్నదఁట. వీరశైవదీక్షానంతరము ప్రౌఢ దేవరాయలు ఉజ్జనియందలి సద్ధర్మసింహాసన పీఠమునకు, పండితారాధ్య సూర్యసింహాసనపీఠమునకు రెండింటికిఁగూడ శిష్యుఁడుగా నుండినట్లు తెలియుచున్నది. ఉజ్జని సంస్థానమునకుసంబంధించి పూవల్లి పంచవణిగె నందీశ శివకవి కర్ణాటభాషలో వ్రాసినమరుళారాధ్య విజయమను గ్రంథములోఁ బ్రౌఢ దేవరాయలు చిరకాలము సంతానము లేక యప్పటి యుజ్జనిపీఠాధీశ్వరుల యనుగ్రహాశీర్వాదములవలన సంతతిఁ బడసెనట్లున్నది. ఇందుచేనాతఁడు విజయనగరమునఁ దన యాస్థానమునఁ బండితారాధ్య పీఠాభిషిక్తుఁడయిన చంద్రభూషణ శివాచార్యునిఁ గూడ నిలిపికొని గురుభక్తితో నాతనిఁగూడ సేవించుచుండినట్లు తలంపనగును. అప్పుడుపపీఠములుగా నుండిన క్రియాశక్తిపీఠములుగూడ నీ చంద్రభూషణ శివాచార్యుని పర్యవేక్షణ పరిపాలనములలోనే యుండియుండును. శ్రీనాథుని కవిసార్వభౌమబిరుదమును ప్రౌఢదేవరాయల యాస్థానమునఁ

బాదుకొల్పిన పండితవతంసుఁ డీతఁడే యయియుండునని తలంచుట సర్వవిధముల సంగతముగా నుండునని నాయభిప్రాయము. విజ్ఞులు పర్యాలోచింతురు గాత!

నిడుమామిడి మఠమునందలి శాసనము ప్రతి.

"శుభమస్తు. కాళయుక్తి సంవత్సర శ్రావణ శు ౧౦ శుక్ర వారం శ్రీమదాగ్రియ రాజగురు మహామండలాచార్య శ్రీ చంద్రి భూషణ దేవ ఒడెయరు నిడుమామిడిన సుదేవస్థావసలి, అరిణమరసర మగ బాబరసను ప్రతిష్ఠ మాడిద బసవరాజదేవరు మంగళమహా"

ఈ శాసనకాలము క్రీ. శ. 1-5-1438 కి సరియగును.

---

## కవిసార్వభౌమ స్మృతి

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జున రావు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

క. నూఱేండులు నిండువఱకు
ధారుణి జీవింతువనుచుఁ దలఁచిరి కానీ
నేరును దలంపరిపుడే
చేరుదు నాకంబునకని శ్రీనాదకవీ!

క. ఎన్నో యాశలు మదిలో
నున్నవి శ్రీనాదకుల సుధోదధిచంద్రా!
సన్నుత సచ్చారిత్రా!
అన్నియు నెఱవేఱకుండ నరిగితివకటా!

క. ముద్రింపఁ జేయకుండ న
ముద్రిత గ్రంథంబులెల్లఁ బోతివ! దివికిన్
ముద్రిణ విషయంబేమిటి ?
సద్రసికా! కృష్ణమూర్తిశాస్త్రీ! అకటా!

క. ఆస్థాన కవీంద్రుడవై
యాస్థానం బాస్థలమని యెంచక మహిలో
నేస్థానమునం బిలిచిన
నాస్థానమునకు ముదమున నరిగితివయ్యా !

క. కనకాభిషేక మొక్కటి
గనుటే కాదయ్య నీవు ఘనసత్కృతులన్
గనినాఁడ విజ్ఞగఁబునఁ
జనినావా ? సత్కృతిఁగన స్వర్గంబునకున్.

క. చెచ్చెఱ నీదరికి మఱల
వచ్చెదనని నమ్మకముగ వచియించితి నే
వచ్చెడి లోపలనే నీ
విచ్చట లేకుండఁ బోతివెట్లు సహింతున్।

క. కవిసార్వభౌమ ! నీ కీ
భువిలోఁ దుల్యుండగు కవిపుంగవుఁ డొక్కం
డెవఁడయినను లేఁడయ్యా
కవితాసామ్రాజ్య మేమి కావించితయా ?

క. భారత భాగవతాదుల
పారముగా వ్రాసియున్న వసుధాస్థలిలోఁ
గీరితినిం గ్రహియించిన
ధీరవరుఁడ ! కృష్ణమూర్తి ! దివి కేఁగితివా ?

క. దివియందిప్పుడు జరిగెడి
కవిజనసభలోనఁ జర్చ గావించుటకై
దివినాథుఁడు గబురంపఁగ
భువినిఁక విడనాడి నీవు పోతివ ? దివికిన్॥

---

## గ్రంథ స్వీకారము - సమీక్ష

(బండారు తమ్మయ్య)

(1) సర్వోత్తమ కథలు :- కర్త ఉభయభాషాప్రవీణ శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారు ప్రధానాంధ్రోపాధ్యాయులు చిలకలూరు పేట హైస్కూలు కొనుపుటలు 80+4 వెల రు 1-0-0

ఇందు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు, శ్రీ రాచమల్లు కన్నయ్య శ్రేష్ఠి, శ్రీ దువ్వూరి రామిరెడ్డి, శ్రీ యార్లగడ్డ రామనాథ బాబు అనెడి యుత్తమ పురుషుల జీవిత చరిత్రలు గలవు. వీరిలో రెండవ వారు మాత్రము సజీవులు. తక్కిన వారు కీర్తిశేషులు. వందే మాతరమ్ ఉద్యమమునాటినుండి, గాంధి సత్యాగ్రహోద్యమమునకు ముందె శ్రీ హరిసర్వోత్తమరావుగారు దేశనాయకులలో నొకరయి తెల్ల దొరల నిరంకుశ ప్రభుత్వమును ప్రతిఘటించి బహుకష్టములకు గురి యయిన మహావీరుడు. భాషాసేవకులుగా, పత్రికాసంపాదకులుగా గ్రంథాలయోద్యమ ప్రచారకులుగా వారు గావించినసేవ దేశీయు లెన్నటికి మఱవరానిది. వారి స్మారకచిహ్నముగా దేశీయులు కృష్ణా జిల్లా పడమటలో సర్వోత్తమభవనమను పేర నొక సంస్థను నెలకొలిపి యున్నారు. రాచమల్లు కన్నయ్యగారు చిలకలూరుపేటలో విద్యార్థి వసతిగృహము, చెఱువులు, బావులు మున్నగు ధార్మిక సంస్థలను నిర్మించిన వైశ్య కులీన వదాన్యశిరోమణి. దువ్వూరి రామిరెడ్డిగారు సరసకవితాధురంధరులయి, కవికోకిల బిరుదవిరాజమానులయి పాన శాల (ఉమర్ ఖయ్యాము), పలితకేశము, కృషీవలుడు, వనకుమారి, కడపటి వీడుకోలు, మీరాబాయి నాటకము మున్నగు నుత్తమ కృతులు వెలయించిన దేశభక్తులు, భాషాసేవకులు. శ్రీ రామనాథ బాబుగారు గుంటూరు జిల్లా కారంచేడు వాస్తవ్యులు, కమ్మవారు. వీరు, వీరి తండ్రిగారు ఓడల వర్తకము వలన విశేష ధనమార్జించి తమ యర్థము ధర్మకార్యములకు విద్యాసంస్థలకు బీద విద్యార్థుల సహాయ

మునకు వినియోగించిన మహాదాతలు. వీరందఱు కూడ సర్వవిధముల నుత్తమ జీవితములు నెఱపిన పురుషోత్తములనుట నిర్వివాదము. హరి సర్వోత్తమరావుగారి నామధేయమందలి యేకదేశమగు "సర్వోత్తమ" శబ్దమును గ్రహించి శ్రీ వేంకటనరసయ్యగారు కృతికి "సర్వోత్తమకథలు" అని నామకరణ మొనర్చుట సముచితముగానున్నది. ప్రధానవిషయము లనేమఱక, సంగ్రహనైపుణితోఁ గృతికర్త యీ జీవితచరిత్రములఁ జక్కఁగాఁ బాఠకలోకమునకుఁ బ్రదర్శించిన విధానము ముదావహము ఇట్టి గ్రంథములు నేటి విద్యార్థిలోకమున కెంతయునుద్దీపకములు నాదర్శకములునయి వారి జీవితములను దీర్చి దిద్దుటకుపకరింపఁగలవని విశ్వసించెదము బంకించంద్ర రవీంద్రులజాతీయగీతములు దేశభక్త్యుద్బోధకములగు పలువురు కవుల పద్యములు గొన్ని యిందుఁ జేర్పఁబడినవి.

(2) సర్వోదయగానము క్రౌను పుటలు 85+13 వెల రు 1 4-0

(3) గీతాంగణము పోకెటు సైజు పుటలు 72+8 వెల రు 1-0-0

(4) తెనుఁగు నీతి :— క్రౌను 34+10 వెల 0-12-0 లు

కర్త :— తెలుఁగు లెంక, ఉభయభాషా ప్రవీణ, తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, విశ్రాంత ప్రధానాంధ్రోపాధ్యాయులు అప్పికట్ల. శ్రీ సీతారామమూర్తిగారు ఆంధ్రకవి పండితలోకమునకుఁ జిరతరముగఁ బరిచితుఁడయి జగమెఱిఁగిన గఱువ. సాహితీప్రియులలోఁ దెలుఁగునాఁటఁ దెలుఁగు ముద్రతో వెలయువారి కవిత నెఱుఁగని వారుండఁజాలరు. వీరి కృతులందలి తెలుఁగుఁదనమున కలరి భాషాభిమానులు తమ పయి మోపిన "అభినవతిక్కన" బిరుదమును జాల కాలము మోసి మోసి యీ నడుమనే షష్టిపూర్త్యుత్సవ సందర్భమున దానిని బరిత్యజించి, తాము స్వయముగ నిడుకొన్న తెలుఁగు లెంక సాంకేతికముతో మాత్రము నేఁడు వీరు విరాజిల్లుచున్నవారు. వీరు మొదటినుండియుఁ గాంధిమహాత్మునియెడ ననుయాయి, వినో

బాభావే మహనీయునియు సర్వోదయ సిద్ధాంతము లందభినివేశము గలిగి యావేశముతోఁ దత్ప్రచారక కృతుల రచించి వెలయించిన వారు. జాతీయతా ప్రబోధకులు. వీరి యుద్గ్రంథము గాంధిమహాత్ముని చరిత్రము, ఆత్మకథ నాగూరాంకితము, సర్వవిశ్రుతము. జాతీయతను వెలార్చు రాష్ట్రగాన, ఉదయ గానకృతులు బహు వ్యాప్తములు. ధర్మ జ్యోతి, ఆత్మార్పణము, కఱిగపంట మొదలగు నితరకృతులు గూడ పట్టివే.

(౨) ప్రకృత కృతులలో "సర్వోదయగానము" శ్రీ వినోబా భావే గారి సర్వోదయ సిద్ధాంతములను, హరిజనోద్ధరణ విషయమున వారు గావించు భూదానయజ్ఞోద్యమ ప్రాధాన్యమును చెప్పఁగా నిరూపించు నొక సర్వోత్తమ కృతి. గాంధి యుద్యమమున సర్వస్వము పరాయత్తము గావించిన దేశసేవకుఁడు, కవిగారి మిత్రుఁడు, శ్రీ తుమ్మల బసవయ్యగారి కిది యంకితమగుట సకల విధముల సముచితముగా నున్నది. "కానుక" యను పేరితో రచితమయిన యంకితాంకపద్యములలో శ్రీ బసవయ్యగారి నిస్స్వార్థసేవ చక్కఁగా నిరూపితమయినది. కృత్యారంభమున విద్వద్విమర్శకులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు చేర్చిన పీఠిక మనోహరముగనున్నది. అతఁడు (వినోబాభావే) రామగంగ, భావేచక్కట్లు, పవిత్ర సన్నివేశములు, పేదలు, క్రొత్త సంక్రాంతి అను ప్రధానాంతర్భాగము లాఱిటితో నీకృతి విలసిల్లుచున్నది. అందునను "భావేచక్కట్లు" అను దానిలో ప్రేమ, చట్టములు, వర్తకులకు, మనుష్యజన్మము, కవులు, కదంబము అను శీర్షికలతోడి విభాగము లాఱుకలవు. పవిత్ర సన్నివేశములలో, నావంతు కూడ, భూదానముతో గోదానము, పగ తెగుట, ఆఱవకొడుకు, రాష్ట్రపతి దీవన, మంచి మేల్కొన్నది, నాకొడుకులు సోమరులుకారాదు, అతఁడంధుఁడు కాఁడు, అల్పదానమెట్లిచ్చెదను. చావునకు భయపడను,

# గ్రంథ స్వీకారము – సమీక్ష

(బండారు తమ్మయ్య)

(1) సర్వోత్తమ కథలు :- కర్త ఉభయభాషాప్రవీణ శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారు ప్రధానాంధ్రోపాధ్యాయులు చిలకలూరు పేట హైస్కూలు క్రౌను పుటలు 80+4 వెల రు 1-0-0

ఇందు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు, శ్రీ రాచమల్లు కన్నయ్యశ్రేష్ఠి, శ్రీ దువ్వూరి రామిరెడ్డి, శ్రీ యార్లగడ్డ రామనాథ బాబు అనెడి యుత్తమ పురుషుల జీవిత చరిత్రలు గలవు. వీరిలో రెండవ వారు మాత్రము సజీవులు. తక్కిన వారు కీర్తిశేషులు. వందేమాతరమ్ ఉద్యమమునాటినుండి, గాంధి సత్యాగ్రహోద్యమమునకు ముందె శ్రీ హరిసర్వోత్తమరావుగారు దేశనాయకులలో నొకరయి తెల్ల దొరల నిరంకుశ ప్రభుత్వమును ప్రతిఘటించి బహుకష్టములకు గురి యయిన మహావీరుఁడు. భాషాసేవకులుగా, పత్రికాసంపాదకులుగా గ్రంథాలయోద్యమ ప్రచారకులుగా వారు గావించిన సేవ దేశీయు లెన్నటికి మఱవరానిది. వారి స్మారకచిహ్నముగా దేశీయులు కృష్ణా జిల్లా పడమటలో సర్వోత్తమభవనమను పేర నొక సంస్థను నెలకొలిపి యున్నారు. రాచమల్లు కన్నయ్యగారు చిలకలూరుపేటలో విద్యార్థి వసతిగృహము, చెఱువులు, బావులు మున్నగు ధార్మిక సంస్థలను నిర్మించిన వైశ్యకులీన వదాన్యశిరోమణి. దువ్వూరి రామిరెడ్డిగారు సరసకవితాధురంధరులయి, కవికోకిల బిరుదవిరాజమానులయి పాన శాల (ఉమర్ ఖయ్యాము), పలితకేశము, కృషీవలుఁడు, వనకుమారి, కడపటి వీడుకోలు, మీరాబాయి నాటకము మున్నగు నుత్తమ కృతులు వెలయించిన దేశభక్తులు, భాషాసేవకులు. శ్రీ రామనాథ బాబుగారు గుంటూరు జిల్లా కారంచేడువాస్తవ్యులు, కమ్మవారు. వీరు, వీరి తండ్రిగారు ఓడల వర్తకము వలన విశేష ధనమార్జించి తమ యర్థము ధర్మకార్యములకు విద్యాసంస్థలకు బీద విద్యార్థుల సహాయ

మునకు వినియోగించిన మహాదాతలు. వీరందఱు కూడ సర్వవిధముల నుత్తమ జీవితములు నెఱపిన పురుషోత్తములనుట నిర్వివాదము. హరి సర్వోత్తమరావుగారి నామధేయమందలి యేకదేశమగు "సర్వోత్తమ" శబ్దమును గ్రహించి శ్రీ వేంకటనరసయ్యగారు కృతికి "సర్వోత్తమకథలు" అని నామకరణ మొనర్చుట సముచితముగానున్నది. ప్రధానవిషయము లనేమఱక, సంగ్రహనైపుణితోఁ గృతికర్త యీ జీవితచరిత్రములఁ జక్కఁగాఁ బాఠకలోకమునకుఁ బ్రదర్శించిన విధానము ముదావహము ఇట్టి గ్రంథములు నేఁటి విద్యార్థిలోకమున కెంతయునుద్దీపకములు నాదర్శకములునయి వారి జీవితములను దీర్చి దిద్దుటకుపకరింపఁగలవని విశ్వసించెదము బంకించంద్ర రవీంద్రులజాతీయగీతములు దేశభక్త్యుద్బోధకములగు పలువురు కవుల పద్యములు గొన్ని యిందుఁ జేర్పఁబడినవి.

(2) సర్వోదయగానము క్రౌను పుటలు 85+13 వెల రు 1 4-0

(3) గీతాంగణము పోకెటు సైజు పుటలు 72+8 వెల రు 1-0-0

(4) తెనుఁగు నీతి :— క్రౌను 34+10 వెల 0-12-0 లు

కర్త :— తెలుఁగు లెంక, ఉభయభాషా ప్రవీణ, తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, విశ్రాంత ప్రధానాంధ్రోపాధ్యాయులు అప్పికట్ల. శ్రీ సీతారామమూర్తిగారు ఆంధ్రకవి పండితలోకమునకుఁ జిరతరముగఁ బరిచితుఁడయి జగమెఱిఁగిన గవన. సాహితీప్రియులలోఁ దెలుఁగునాఁటఁ దెలుఁగు ముద్రలో వెలయువారి కవిత నెఱుఁగని వారుండఁజాలరు. వీరి కృతులందలి తెలుఁగుఁదనమున కలరి భాషాభిమానులు తమ పయి మోపిన "అభినవతిక్కన" బిరుదమును జాల కాలము మోసి మోసి యీ నడుమనే షష్టిపూర్త్యుత్సవ సందర్భమున దానిని బరిత్యజించి, తాము స్వయముగ నిడుకొన్న తెలుఁగు లెంక సాంకేతికముతో మాత్రము నేఁడు వీరు విరాజిల్లుచున్నవారు. వీరు మొదటినుండియు గాంధిమహాత్మునియెడఁ దనుయాయి, వినో

మ స్తత్పూర్వయాంతరములఁ బ్రేమప్రవాహ । వీచికామాలికలు పొంగు వేళ నొదవు । క్రొత్త సంక్రాంతి యిది శుభోదాత్తమగుచు।

4. మేడప్రక్క గుడిసెమేలిమి బంగారు పట్టువలువ సరసఁ బ్రాఁతగోఁచి తనివిచొదవింతే తెలుగవి కన్నీరు । లేనిపంకు విధిఫలింపవలయు।

3. గీతాంగణము :- భావేగారు తమ యుపన్యాసములలో భగవద్గీత యందలి కొన్ని ప్రధాన శ్లోకములను వాని యనువాదములను బఠించుట చాలమందికి ననుభవసిద్ధమైన విషయము. పదునెనిమిది యధ్యాయములనుండియు వారట్లు పఠించు శ్లోకములకు అధ్యాయముల వరుసనే శ్రీ సీతారామమూర్తిగారు రచించిన యాంధ్రీకరణములు ఈగీతాంగణ రూపమును దాల్చినవి. గాంధి భావేపథానువర్తులు, కవిగారి యాప్తమిత్రులు నగు డాక్టరు శ్రీ వెంపటి సూర్యనారాయణ (తెనాలి)గారి కిది 'రంగవల్లి' యను శీర్షికతో నంకితమయినది. కొన్ని పదముల యర్థములు గ్రంథము చివర వ్రాయఁబడినవి. గీతాగాన ప్రవచనము లొనర్చు భక్తులకిది చాల నుపయుక్తము. మచ్చునకుఁ గొన్ని సుప్రసిద్ధ శ్లోకముల యనువాదములు.

గీ॥ కర్మమందె నీకుఁగల దధికారంబు । లేదు ఫలమునందు లేశమేని ।
ఫలమువలచి నీవు సలుపకుమీ కర్మ । మియ్యకొనకు కర్మ మీసడింప (అధ్యాయము 2 ప 47)

గీ॥ ఇడుమలకుఁ జిక్కి బెంబేలు పడనివాఁడు । సుఖముపట్ల ననాసక్తిఁ
జూపువాఁడు । వలపు గగ్గోలు రోసంబు వదలువాఁడు । పార్థ
నుడువఁబడున్ స్థితప్రజ్ఞుఁడనుచు (అ 2 ప 56)

గీ॥ ఎపుడు ధర్మమునకు హీనత వాటిల్లు । నెపుడధర్మమునకు నేపువచ్చు ।
నపుడు నన్ను నేన యస్మదీయంబగు । మాయచే సృజింతు నోయి
పార్థ (అ 4 ప 7)

గీ॥ విద్య వినయమ్ముఁగల బ్రాహ్మవిదుని మొదవు । నేనికను గుక్కురం
బును హీనచరితు । నెవఁడు సమదృష్టిమైఁజూచు నతఁడె పాండు ।
రాట్సుతా ! పండితుఁడనంగ రాణకెక్కు । (అ 5 ప 18)

4. తెనుఁగునీతి :- భర్తృహరి సుభాషిత రత్నాకరమందలి నీతిశతకమునకు నేఁడు సీతారామమూర్తిగారు వెలయించిన యనువాద మిది. మాతృదేవత శ్రీ చెంచమ్మగారి కంకితము గావించిరి. భర్తృహరి గ్రంథమున కిదివఱలోఁ బూర్వకవులు పుష్పగిరి తిమ్మన, ఏనుఁగు లక్ష్మణకవి, ఎలకూచి బాలసరస్వతి మొనర్చిన యనూదిత కృతులాంధ్రులకుఁ జిరపరిచితములు. అందువను లక్ష్మణకవి యనువాదమా బాలగోపాల ప్రసిద్ధమై బహుళ పఠన పాఠన ప్రచారము నందియుండుట సర్వవిదితము. ఇట్టియెడ సీతారామమూర్తిగారి యీ నూతనానువాదమున కావశ్యకత యేమియను ప్రశ్నమునకు "సుకవి" యను మున్నుడిలోఁ గృతికర్తయు, "తిలకరేఖ" యను పేరి పీఠికలో 'సాహిత్య విద్యా ప్రవీణ" శ్రీ యార్లగడ్డ వేంకటసుబ్బారావుగారు నొక్క విధముగ సమాధానముల నొసంగియున్నారు. లక్ష్మణకవి కృతికి లోకమున వెలసిన కీర్తిగౌరవముల కేపాటిన్యూనతయుఁ దమకృతివలనఁ గలిగించు తలంపు కృతికర్తకు లేదు. అట్టిదెన్నఁడు కలుగఁజాలదు కూడ. 'ఈ కవి తెనుఁగుఁదన మీ కృతిలో నాద్యంత మనుస్యూతమయినది. నీతిశతకమునకుఁ దాను తెనుఁగు ముద్ర వైచినాఁడు. అందుచే నది "తెనుఁగునీతి" యైనది" అని పీఠికాకర్తలు శ్రీ వేంకటసుబ్బారావుగారు గ్రంథనామమునకు ఉపపత్తి గలిగించిరి. కొన్ని శ్లోకముల యనువాదములో లక్ష్మణకవి స్వేచ్ఛగాఁ బ్రక్రమ విధానమును మూల న్యూనతిరిక్తములను వ్యర్థపదప్రయోగములను నొనర్చియున్నాఁడనుట వాస్తవమే. "ఏ నరునకు విత్తముగల । దానఁడె కులీనుఁడధికుఁడార్యుఁడతండే" దానము భోగము నాశము పూని

తతో మూఁడు గతులు భువిధనమునకున్" ఇత్యాది పద్యము లిందుకుఁ దార్కాణములు. శ్రీ వేంకటసుబ్బారావుగారు అట్టి వానిని గూర్చి కొంత చర్చించిరి. తెలుఁగు మాత్రతో సాధ్యమయినంతవఱకు మూలానుగుణముగనే యనువాదము గూర్చుట తెలుఁగు లెంకగారి ప్రధాన లక్ష్యము. కుంటువడని నడకతో నొఱపుతో వీరి రచనము ధారాళముగనే సాగినది. పూర్వాధునిక పద్యగద్యకృతులందలి కొన్ని భాగములనేఱి సూక్తులఁ ఫయినలు తెలుఁగు పాఠ్యగ్రంథములఁ గూర్చుటలో విద్యాధికారులు తఱచుగ లక్ష్మణకవి నీతి శతక పద్యములఁ గొన్ని కయికొనుట పరిపాటిగా నున్నది

అవి చిరకాలముగ విద్యార్థి లోకమునకుఁ బరిచితమయినవే గనుక నికముందు వారు సీతారామమూర్తిగారి పద్యములఁ గొన్నిటి నట్టి పాఠ్యగ్రంథములలోఁ జేర్చి విద్యార్థులకుఁ బరిచయమొనరింతురు గాక యని యాశించుచున్నాము.

మచ్చునకుఁ గొన్ని పద్యములు.

అదిడాచిన సిరి నరునకు। నది సొగసది కీర్తి సౌఖ్యమది గురువది ప్రా। పదిరాజపూజ్య మదివే, ల్పది చదువది; చదువు లేనియతఁడెద్దుగదా.

1. రొక్కముున్నవాఁడె చక్కనివాఁడు స। త్కులమువాఁడు చదువుకొన్నవాఁడు। మెఱుగెఱుంగువాఁడు నేఱుపల్కువాఁడగు। నెల్ల పసలు పసిడి నెనసియుండు.

2. పగటి మొదటి నీడపగిది దుర్జనమైత్రి, తొలుత హెచ్చి యవలఁ దొలఁగబాఱుఁ। బగటి చివర నీడ పగిది సజ్జనమైత్రి, ముందు తగ్గి వెనుక ముమ్మరించు॥

3. ఇచ్చెను దుగ్ధ మాత్మగుణ మెల్ల నిజాప్తతఁ గన్న వారికిన్। నచ్చలి కాగుటన్ గలఁగి నీరము నిప్పులదూఁక నీరటుల్। నచ్చుట

కోర్వక గ్నిం బడసాగిన పాలుజలమ్ము చేరుటన్। జెచ్చెరం దేతను త్త
ముల చెల్మి తెఱంగిటులుండు నబ్రమై.

పాఠకులు వీనిని లక్ష్మణకవి పద్యములతోం బోల్చి చూచి యిందలి గుణముల గణింతురుగాక.

4. శ్రీమదాంధ్ర శివగీత:- కర్త:- శ్రీ గుంటు వీరభద్రకవిగారు విలస విల్లి-అమలాపురము తాలూకా డెమ్మీ పుటలు 136+16 వెల రు 2-0-0 లు.

గీతా వాఙ్మయములో మహాభారతాంతర్గతమయిన భగవద్గీత (శ్రీకృష్ణార్జున సంవాదాత్మకము) వలెనే పద్మపురాణాంతర్గతమయిన శివగీత (శ్రీరామాగస్త్యసంవాదాత్మకము) భారతదేశమునం జిరకాలమునుండి పఠనపాఠనములలోం బ్రఖ్యాతిగన్న ప్రసిద్ధ కృతులలో నొకటి. రావణ సంహారము మహోత్కృష్ట కార్యమనియు, శివయోగ విద్యావలంబనమున శివానుగ్రహమును బడసి పాశుపతాస్త్రలబ్ధి నొందిననేగాని శ్రీరాముని కది సాధ్యముకాదనియు, అగస్త్య మహర్షి యుద్బోధింపఁగా శ్రీరామచంద్రుం డాశివయోగి వర్యునివలనం బాశుపతదీక్షనొంది శివప్రసాదమునం బాశుపతాస్త్రమునంది యందుమూలముననే రావణుని జయింపఁగలిగెననెడి యితివృత్తమును బురస్కరించికొని రచింపఁబడినది, శివగీత. ఇందు భక్తినిరూపణ, వైరాగ్య, విరజాదీక్షాలక్షణ. విభూతి, విశ్వరూప సందర్శన, గర్భోత్పత్త్యాదికథన, శరీర నిరూపణ, జీవస్వరూపనిరూపణాదిక శివయోగ విషయము లెన్నియో నిరూపింపఁబడినవి. భగవద్గీతయం దుదాహృతములు కానివి జీవోత్పత్తికి, శారీరకస్థితికి సంబంధించిన దుర్గ్రాహ్యవిషయములింకెక్కువగా నిరూపితములగుట యొక విశేషము. ఇట్టి కృతిని శ్రీ వీరభద్రకవిగారు (దేవాంగవంశజులు) నాలుగాశ్వాసములుగా లలిత శైలిలో నాంధ్రీకరించి చరితార్థు లగుట ముదావహము. శివగీతకుం

బూర్వాంగ్రీకరణములు కొన్నియున్నను నవి ప్రచారమున నున్నట్లు కనరాదు. ఇది 1945 సంవత్సరములోఁగవిగారి మిత్రుల సాహాయ్యమునఁ బ్రథమముద్రణమంది మరల నేఁడు ద్వితీయముద్రణమందినది. స్వామి నిర్వికల్పానంద మున్నగు పలువురు పండితులు, పత్రికాధిపతులు నొసంగిన సదభిప్రాయములు గ్రంథమున ముద్రితమయినవి. ద్వితీయ ముద్రణమునకును హాయులయిన శ్రీ ఇనుమర్తి వీరభద్రరావుగారు (రాజమండ్రి) కాశిన వేంకటరత్నముగారు (బండారులంక) అభినంద నీయులు. గ్రంథముద్రణము సుందరముగానున్నది. మచ్చునకుఁ గొన్ని పద్యములు.

శా॥ ధర్మంబుస్విడనాడు శాత్రవుఁడు ప్రాప్తంబాట భాగ్యంబునఁ,
తక్కర్మాచారుఁడు, వేదశాస్త్రవిదుఁడున్, ధర్మార్థవ్రాధ్వర్యుఁడున్
నైర్మల్య స్థితుఁడున్ వినాశనము నొందంబోవు కాలమ్మునన్
ధర్మంబున్ విడునట్టి వానిఁ గెలువన్ సాధ్యంబు కాకుండు నే
(ఆ౹ ప 142)

ఉ॥ జంతువితానము ల్తినెడి సర్వపదార్థపు సారమెన్న న
శ్రాంతము మూఁడు భాగములు సల్పెడి యజ్జఠరాగ్నిదాననొఁ
గొంతమలంబు మాంసమును గొంతమనస్సుగఁ గొంతకాన వే
దాంతులు ప్రాణమన్నమయమంచు వచించుట లాయెరాఘవా,
(ఆ 2 ప౹ 80)

మ॥ ఘనుఁడాత్మండుస్వయంప్రకాశుఁడయినన్ గాయేంద్రియాతీతుఁడై
నను మోహంబను నంతరాయ మొకఁడు నాత్రింప నార్తిస్థితిన్
గనియెన్ వేఱయి బ్రహ్మమందు విచలత్కాంతాత్మ జాప్తాశ్రిత
ప్రీతుండై చెడె సంస్కృతిం బడలియవ్యక్త ప్రకృత్యుక్తుఁడై
(ఆ 3 ప 53)

ఉ॥ దానవయక్షరాక్షసులు దా మొనరింపఁగ లేరు విఘ్నముల్,
పూనిభుసీతటమ్ము ననుభూమిధరాగ్రిమునన్ శివాలయా
స్థానములోన నగ్గికడ దైత్య నిషూదను సన్నిధానమం
దైనను బిల్వమూలమున నైన జపమ్మొనరింపరాఘవా
(ఆ 4 ప 109)

(6) పుష్పమాల (ఖండకృతి) కొ్రాను పుటలు 48 వెల రు 0-12 0
(7) నానార్థశతకము :- కొ్రాను, పుటలు 20+8 వెల 0-8-0
కర్త :- విద్వాన్ కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు, నివృత్త
ప్రధానాంధ్రోపాధ్యాయులు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

(1) పుష్పమాల :— ఇది కవిమిత్రులు శ్రీ వీరువ వేంకట రామయ్యగారి కంకితము. వేర్వేఱు విషయములకు సంబంధించిన 41 ఖండకృతు లిందు సంధానింపఁబడినవి. ఇందుఁ జాలవఱకుఁ బాడిత ప్రశంసలకు, అందందు జరగిన తత్సమ్మానములకుఁ సంబంధించినవి. మఱికొన్ని పాఠశాలా వార్షికోత్సవములకు నితర విషయములకు సంబంధించినవి. కృతికర్త శ్రీ దుర్గా మల్లికార్జునరావు నవనవోత్సాహపూరితులగు భాషాసేవకులు. బహుముఖముల వారి భాషావ్యవసాయోద్యమము సాగుచుండును. అందుఁ గూర్చి వీరి యితర కృతులు కొన్నిటిని సమీక్షించుటలోఁ బూర్వ సంచికలలోఁ బ్రశంసించియే యున్నాము. ఈ గ్రంథమునకు వ్రాసిన తొలిపలుకులో విమర్శకాగ్రేసర శ్రీ కొత్త భావయ్యచౌదరిగారు గ్రంథస్థ విషయములఁ గూర్చి, కృతికర్త భాషాసేవోత్సాహములఁ గూర్చి సముచిత ప్రశంస గావించి, భాషాభిమానులు వీరి గ్రంథ ప్రకటనములకుఁ జేయూఁతనొసంగ హెచ్చరిక గావించియున్నారు. మేము గూడ నందుకు తోడు పలుకుచుము ఇందలి కృతులన్నియుఁ జాలవఱకు ధారాళమైన శైలిలోఁ గందము, గీతము, మున్నగు చిన్న చిన్న పద్యములలోఁ గూర్పఁబడి యున్నవి. మచ్చునకుఁ గొన్ని.

గీ॥ ధర్మము గతించినట్టి యీకలియుగమందు
దైవభీతి లేనట్టి యీ తరుణమందు
బ్రదుకరాదంచు ధ్రువముగాఁ బలికినావు
ధీమహితగేయ! శ్రీరామ నామధేయ.

(శ్రీపట్టిశ్రీరాములు)

గీ॥ ఇంచుకయుఁ దారతమ్యంబు నెఱుఁగకున్న
వారు గావున బాలుర ప్రార్థనములు
పావనములంచు వాకొన-వచ్చు మనము
అంచు నేఁడు శ్రీ భావె వచించు చుండె.

(సుభాషితములు)

గీ॥ కంటకంబు వెఱుగఁ గాలిలో నెపుడేని
నమితబాధ మీరలం దుచుందురి
బడియతోడ మమ్ము బాదుచుందు రెపుడు
అనుచితంబు గాదె మనుజులార

(గోవిలాపము)

(ii) నానార్థశతకము :—

ఉన్నత పాఠశాలా విద్యార్థులయు నుపాధ్యాయులయు ధారణ సౌలభ్యమునకయి శ్రీ మల్లికార్జునరావుగారు రచించిన తత్సమ శతక, రూపాంతరశతకములకు సంబంధించిన సమీక్ష గత సంచికలోఁ గావించియున్నాము. అట్టి కోవకుఁ జెందినదే యీశతకము గూడ. దీని వలన విద్యార్థులు పడయు ప్రయోజనము వివరించుట యనవసరము. ఆంధ్రమున నిట్టి రచన మద్వితీయము. ఆస్థానకవి కీ॥శే॥ బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిసార్వభౌములకిది యంకితము. వారి నిర్యాణమునకుఁ బూర్వమే యిది వెలువడకుండుట శోచనీయము. కవి గారికి సహజమయిన ధారాళ శైలిలో నీశతక రచన మలరుచున్నది.

మచ్చునకు రెండు పద్యములు.

కం॥ ధారయన నాశుకవనము
ధారయను పదంబు నీటి ధారకుఁ జెల్లున్
ధారయనఁ గత్తి వాదర
ధారయని వచించు చుండ్రు ధారాపురికిన్ (ప 44)

కం॥ ఖగమనఁగాఁ బక్షి యగును
ఖగమనఁగా నర్థమయ్యెఁ గాయంబునకున్
ఖగమనఁగా మారుతమగు
ఖగమనఁగా నర్థమాశుగంబున కయ్యెన్॥ (ప 95)

(8) అంతర్దర్శనము :—క్రౌను. పుటలు 164+8. వెల రు 2-8-0 కర్త :— కవిరాజ, సాహిత్య విశారద, శ్రీ ఉప్పాడ రాజారావుగారు, ఎం. ఏ., ఆంధ్రోపన్యాసకులు కాకినాడ కళాశాల. ప్రకాశకులు:— హనుమంతు మోహనరావుగారు, తలగాము, శ్రీకాకుళముజిల్లా.

నేటి సమాజమున సాంఘిక, రాజకీయ, సారస్వతాది వివిధ రంగములలో నాంతరంగికముగఁ బ్రబలియున్న దుర్నీతిని, మాలిన్యమును, బహిరంగమొనర్చి పరామర్శించి, తన్మూలమున వాని నిర్మూలనమునకయి పాటుపడి దేశకల్యాణమునకుఁ దోడ్పడు సదుద్దేశముతో రచింపఁబడిన సత్కృతియిది. ఇందువలన లోకము మరమ్మత్తు కాఁగలిగి నచోఁ గవిగారికృషి చరితార్థత నందఁగలదు. సంఘముయొక్క లోఁతుపాతులలోనికిఁ జొచ్చి, యంతర్దర్శనము (insight) గావించి, యందలి మలినతను వెలువరించుటలో నీకవియొక్క మేధ యపరాధ పరిశోధకునివలెఁ బరిచరించినదని బాహాటముగఁ బలుకఁదగును. ఇందు సాభిప్రాయనామకములగు క్రీనీడ, స్వర్ణశృంఖలములు. నూత్న చైతన్యము, సాఁబాలు, భిన్నదృక్పథము, ఆర్తత్రాణ, ఆకాంక్ష, కాలపాశము, ఆత్మీయత, వైరాగ్యము, గుసగుసలు, స్వాతంత్ర్య దశ

మూఢము, సమత్వము, చరమోపదేశము, శిక్షణ, మార్గదర్శి, అను తాపము, ఒప్పందము, మగనాలు, ఆపద్ధర్మము ప్రయోగము, స్త్రీ స్వాతంత్ర్యము, పురానుభూతి, పిశాచఖేలనము, సంకల్పము, అను ఖండకృతు లిరువదియైదు. కేవల గ్రంథభాగమునకుఁ దన్నామమునకు సంబంధించినవి గలవు. దేనికదియొక ప్రత్యేక విషయమును గూర్చి రచించినదై యుండును. చివరను **26, 27** ఖండములుగఁ జేర్పఁబడిన ఆంధ్రతేజము, ప్రత్యభినందనము ననునవి కవి యుద్దేశించిన గ్రంథ ప్రణాళికకుఁ బ్రసక్తి లేనివి. "ఆంధ్రతేజ"మనునది ఆంధ్రప్రదేశ ప్రథమావతరణ మహోత్సవ సందర్భమునఁ గాకినాడలోఁ జరిగిన సభలోఁ గవి చదివిన పద్యములు. "ప్రత్యభినందనము" కాకినాడయందలి "కవి పండిత పరిషత్తు" తనకు "సాహిత్య విశారద" బిరుదమును బ్రసాదించిన సభలోఁ గవి కృతజ్ఞతాపూర్వకముగ రచించిసమర్పించిన పద్యములు. సాంసారికజీవనములో భార్యాభర్తల కన్యోన్యానురాగములు లేకున్నఁ గలిగెడియనర్థకములు, వేశ్యాలోలురైన భర్తలింటిపట్టులుఁగక సానులయింటిబందాలయి వర్తింప, వారి భార్యలు హీనవంశ్యులగు నింటినవుకరుల మరగి వారితోఁ గ్రీడించుట, భోగలోలురై యారోగ్యమునుఁ బాడుచేసికొన్న పురుషులు తమ యిల్లాండ్రఁ దనియింపలేక వారి వ్యభిచారవృత్తికిఁ దాముగూడఁ దోడ్పడి సాగించు హేయ జీవనము, అచలయోగుల మనుపేర వంచకులు తమ యాశ్రమములలో సమత్వమను నెపముతో స్త్రీలశీలములఁ జెఱచివారిని భోగినులుగా నొనర్చెడి ఘోరకృత్యములు, ఇత్యాది గూఢరహస్య విషయములనుగూడఁ బయటపెట్టుటలో నీకవి లేఖిని వెనుకాడకుండుట గమనింపఁదగినది. ఇవి చదువుటకు జుగుప్సాకరములుగానే యుండును. పాఠకులకు సంయమనమవసరము. మగనాలు, ప్రయోగము, ఒప్పందము, సమత్వము అను పేరిఖండములఁ జదివిన నీవిషయములు వ్యక్తము

కాఁగలవు. క్రీనీడ యనుఖండములో సామాన్యభాషాజ్ఞానము గలవారు వాడుకభాషలోఁ గృతులవ్రాసి పేరుగాంచి ధనార్జన మొనర్చుచుండఁగా, బూర్వాచార పరాయణుఁడు పండితుఁడునగు తనభర్త దారిద్ర్యమను భవించుటకు వగచి యాతనిభార్య నాతని మందలించుచందము లంద ముగా వర్ణింపఁబడినవి. నేఁటి కార్మికు లయినదానికిఁ గానిదానికి సమ్మెలతో యజమానులను బెదరించు వితములకు జీకాకునొంది పల్లె పట్టులలో శాంతముగ వినయ విధేయతలతో, విశ్వాసములోఁ దమ భూస్వాములఁ గొలిచి సుఖజీవనము నెఱపు కూలీలు గావించు పరామర్శ నూత్న చైతన్యమను ఖండమున హృదయంగమముగా వర్ణితమయినది. దేశమునకు స్వాతంత్ర్యమువచ్చి చాలసంవత్సరములయినను నిప్పటికిఁ గూడ సంఘీయులలోను బ్రిభుత్వోద్యోగీయుల యందును బక్షపాత ములు, కులమతాభిమానము లేమాత్రము నశింపక దేశాభ్యుదయ మునకుఁ గావించుచున్న నిరోధములు 'స్వాతంత్ర్యదశమాబ్దము' అను ఖండమున సరసముగ వివరింపఁబడినవి. తినుటకుఁ గూడు లేకున్నను దుర్వ్యసనములకులోనయి సుఖరోగములపాలయి మంచమెక్కిన రొక "రిక్షావాలా" భార్య యాతని రోగములకుఁ దానుగూడ సమభాగిని కావలసిన దుర్గతికివగచి చీవాట్లుపెట్టుట "సాఁబాలు" అనుఖండము నకు విషయమయియున్నది. ఇట్లే యిందలి ఖండకృతులన్నియు వేర్వేఱు విషయములకు సంబంధించి వివిధరూపములగు కల్మషముల తొలఁగింపనెంచి... తొలఁగి (?)

శాళన మొనర్చి నీతిబోధకములుగఁ దనరారుచున్నవి. అందఱు నవ శ్యముగ నీగ్రంథభాగముల సావధానముగఁజదివి యానందింపఁదగును.

గ్రంథము కవికాప్త బంధుఁడగు నంబాళ్ళ నందగోపాలుగారి కంకితము గావింపఁబడినది. ఆతఁడు తన్నుఁ గూర్చి పలికిన సంబోధన ములలో నవతారికయందుఁ గవి "సజీవాంధ్రభాషాపోష" యను విశేషణమొకటి పేర్కొని నాఁడు. ఇందుచే నీకవి సజీవాంధ్రభాషాభి

మాని యనుట విస్పష్టము. ఈ కవి దృష్టిలో సజీవాంధ్రభాషయన నేఁడు శిష్ట జనవ్యవహారములో బాహాటముగాఁ జేరి జనసామాన్యమునకు సుబోధకములుగఁ జలామణీయగుచున్న పారిభాషిక పదములను, అన్యభాషాపదములను, మాండలికపదములను గద్య పద్య రచనములలో నవిరళముగఁ గయికొని యాదరించుటయే గాని, సనాతన సంప్రదాయములకు ఛందో వ్యాకరణలక్షణములకు విరుద్ధముగ గ్రంథరచనము గావించుట గాదు. ఈతఁడు గ్రాంథికభాషాభిమానియే గాని వ్యావహారికభాషా వ్యామోహితుఁడు గాఁడు. ప్రకృత కృతి "అంతర్దర్శనము" కవి సజీవాంధ్రభాషారచనమున కాదర్శకముగానే యున్నది.

మచ్చునకుఁ గొన్ని పద్యములు

1. మొదటికి మోసమౌ జతనముల్ పొనరింపకుఁడీ విధానమొ
ప్పదు మన రైతులందుఁ దగుఁబట్టణమందలి కార్మికాళికిన్
ఇది ప్రకృతి ప్రవిష్టమును హీనఫల ప్రదమౌను యంత్రముల్।
కుదురుకొనంగ సంఘటిత కూటములన్ నిజకామసిద్ధియే
(నూత్నచైతన్యము)

2. మగనాంధ్రన్ వగపింపఁజేసి పెఱకొంపల్ దూఱు నా "పోకిరీ"
లఁగచాట్లందుట తప్పదెందునిపుడీ నార్జించు రోగమ్ములన్।
సగపాల్ నాకులభించుచుండునిఁక నీ జాడ్యమ్ములన్ ద్రుళ్లుటే
యగుఁ గేల్వట్టినదానికిన్ ఫలము భాగ్యంబిట్లుపండెంగటా (సాఁబాలు)

3. పదవులు గౌరవమ్ములును జాతిక భేదము నాశ్రయింపన।
భ్యుదయము పేర సంఘము మూలకవినాశముఁగాంచు మంచిని।
ట్లదయతఁదోలి క్రూర— నెక్కరణీనందును మాన్యతమాతృభూమి? యీ
చదువులు చట్టుబండలయి సద్గుణముల్ నశియింపఁ జేయఁగన్
(స్వాతంత్ర్యదశమాబ్దము)

4. నీరుంబాలుఁగ దంపతుల్ పుడమిలో నిత్యంబుఁ జెన్నారఁగా
నేరీతిన్ సమకూరు, నిత్తమునెతా మెల్లప్పుడున్ గొల్చుచున్
నారీచిత్త సముద్భవ వ్యథను గానంబోనిస్వార్థాత్మునిన్
జేరన్ గన్యక, శుల్క, మిచ్చి వరునిన్ జేకూర్చ రాదెన్నఁడున్

(సంకల్పము)

సవరణాల సూచన :—

గతసంచిక (సం 48 సం 5-6) లో "గవరల ప్రాచీన చరిత్ర", గూర్చినసమీక్షలో 94 పుట 5 పంక్తిలో క్రీ॥ శ॥ అనునది క్రీ॥ పూ॥ అనియు,24 పంక్తిలో "కాలినాయకుఁడు"అనునది కామి నాయకుడు అనియు సవరించి చదువుకొనఁ గోరెదము.

---

## అనంతామాత్యుని భోజరాజీయము

పరాశరం గోపాలకృష్ణమూర్తి ఎం. ఏ.

బహు కథాత్మకమైన పద్యసారస్వతము తెనుఁగు వాఙ్మయమున నేకశాఖలై వెలయుచున్నది. కేతన దశకుమార చరిత్రము, జక్కన విక్రమార్క చరిత్రము కొఱవిగోపరాజు సింహాసన ద్వాత్రింశిక, అనంతామాత్యుని భోజరాజీయము, దూబగుంట నారాయణకవి పంచతంత్రము, హంసవింశతి, శుకసప్తతి మున్నగునవి యీజాతికిఁ జెందినవే.

భోజరాజీయమును రచించిన యనంతామాత్యుఁడు కవి, లాక్షణికుఁడు నలంకార శాస్త్రజ్ఞుఁడును, మహాకవి తిక్కనచే 'భవ్య భారతి' యని కొనియాడఁబడిన బయ్యన కేతఁడు ముని మనుమఁడు. తిక్కన మల్లమ్మల సుపుత్రుఁడు. తిరుమల నల్లాన్ గోవింద చక్రవర్తికి శిష్యుఁడు, కౌండిన్యగోత్రుఁడు. విష్ణుభక్తుఁడగు నితఁడు తన భోజరాజీ

యమును నరాంకిత మొనర్చక యహోబల నరసింహున కంకితమిచ్చి చరితార్థుఁడయ్యెను. తన వంశమును గూర్చి సగౌరవముగ సవిస్తరముగఁ జెప్పుకొనిన కొలఁదిమందిలో నితఁడొకఁడు. శ్రీకాకుళము (కృష్ణామండలములోనిది) సమీపమందలి పెనుమగూరు వీరి వాసస్థలము. అనంతుఁడు తాను రచించిన 'రసాభరణమున'.

"జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్వాలేంద్రులై యొప్పున
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీ భౌమ యు
క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీనిండన్ ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగన్"

అని చెప్పుకొనియుండుట వలన శాలివాహన శకము 1356 వ సంవత్సరమునకు సరియగు క్రీ. శ. 1435 (25-1-1435) సంవత్సరము ప్రాంతము వాఁడని నిశ్చయముగాఁ దెలియుచున్నది. కావున నితని కాలము పదునైదవ శతాబ్ది పూర్వభాగము. రసాభరణమను నలంకార గ్రంథమును, ఛందోదర్పణమును, భోజరాజీయమును నితని కృతులు.

ఇతని కించుమించు సమకాలికుఁడగు జక్కన విక్రమార్కచరిత్రమును రచించి ప్రసిద్ధినందుట వలనఁ దత్సజాతీయమగు భోజరాజీయము ననంతామాత్యుఁడు రచించెను. ప్రసిద్ధుఁడగు విక్రమార్కుఁడందు నాయకుఁడయిన నాదిరాజ సన్నిభుఁడగు భోజుఁడిందు నాయకుఁడు. రెండును బహుకథామయములగు కావ్యములే. కవులును నొకరికొకరు తీసిపోవువారు కారు, జక్కనకన్న ననంతుఁడు పండితుఁడు అనంతునికన్న జక్కన చేవగలకవి, జక్కనకవిత్వము పటిష్ఠము సుశిక్షితమును, అనంతునికవిత్వము నిసర్గరమణీయము మృదులమును నయియున్నది.

భోజరాజీయము పౌరాణిక ఫక్కిలో నడచిన కావ్యము. పౌరాణిక ఫక్కిలోఁ గథల వలన నీతులు చెప్పఁబడును. అందుఁగొంత చరి

త్రయుఁ గొంత కల్పనయు నుండును. "కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము..." లను పద్యమునఁ జెప్పినటులు కేవలకల్పనమును యథార్థమును గాక భోజుఁడను చారిత్రికపురుషుని నాధారముగాఁ జేకొని కాలిగోరు చూచి రమణిని జిత్రించు చిత్రకారుని భంగిఁ దన లోకజ్ఞానమును బహుశ్రుతత్వమును బురస్కరించుకొని నీతిబోధకమగు నీ కావ్యము నితఁడల్లెను." "*History of the race is repeated in the history of the man*" అని చెప్పినటులు ప్రాచీనకాలమున మతము జీవితముతో ముడివడియుండుటంబట్టి యనంతామాత్యుఁడును మతవిహిత ధర్మముల నటనట నీతులనుగా ధర్మముగాఁ జెప్పెను. సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పినటులు పురాణములు రచింపఁబడి యున్నటులే మహుఁడను కాంభోజరాజునకు దత్తాత్రేయుఁడు చెప్పినటులీ కావ్యమున్నది.

మహుఁడను కాంభోజరాజు కుష్ఠవ్యాధి పీడితుఁడై గౌతమీ నదిని దనువుజ్జగింపఁబోవును. గౌతమి యతనిని వారించి దత్తాత్రేయుని కడ కంపును, దత్తాత్రేయుని వలన మహుఁడు రోగవిముక్తుఁడయి, శ్రీరంగాది మాహాత్మ్యములు, భోజుని చరిత్రమును విని తుదకు స్వదేశమున కేఁగును. సంగ్రహముగా నిందలి యుపక్రమోపసంహారము లివి. ప్రయాగయందొక దరిద్రబ్రాహ్మణుఁడు మృతుఁడై భోజుఁడుగాఁ బుట్టును. భోజమహారాజొక నాఁడడవిలో సర్పటి యను సిద్ధునిఁ జూచి పిలుచుకొని వచ్చి వాని ఘూమవేధి విద్యను మోసముచే గ్రహించి శప్తుఁడయి శాపవిమోచనమును వేఁడికొని యతని వలన నతిథి పూజాప్రభావాదికములగు పెక్కు కథలను వినును.

భోజుని జన్మవృత్తాంతముతో మొదలిడి భోజుని మాహాత్మ్య వర్ణనముతో నంతమయిన యీ కావ్యము స్థూలారుంధతీ న్యాయమున భోజరాజీయమనఁబడుచున్నది విక్రమార్క చరిత్రమునందుఁ బ్రతి

కథయు విక్రమార్కుని సాహసౌదార్యాది గుణములలో నేదోయొక దానిని బ్రతిపాదించి సార్థకమయియుండ నిందట్టిదేమియును లేకుండుట విచార్యము. అట్లయ్యు నిందలి కథలు నీతిబోధకములు నానందదాయకములును. విక్రమార్క చరిత్రమునకువలె దీనికి నేమాత్రము మూలమును లేకుండుట వలనఁ గథాకల్పనమును గ్రథనమును ననంతామాత్యుని స్వీయములు. కావున నితని ప్రతిభ కొంతవఱకు మెచ్చఁదగియున్నది. భోజుని సాహస వితరణాది ప్రతిపాదకములగు కథలను గూర్చియుండిన, నామసార్థక్యమింతకంటె బాగుగ జరిగియుండెడిదేమో ?

కథలోఁ గథ, యందులో మఱియొక కథగాఁ గూర్పఁబడిన యీ కావ్యము కథాసరిత్సాగరములోని కథా సంవిధానమువలె నున్నది. అతిథిపూజా ప్రభావమును దెల్పు పుష్పగంధీరత్న మండనులకథయు నిందలి పెద్దకథలు. మూఁడువంతుల కావ్యము వీనితో నిండిపోయినది. మహారాక్షసుని హృదయమును, మహాక్రూరమగు వ్యాఘ్రము మానసమును, మహాకామాంధుని మనస్సును మార్చివేసి మహోన్నత పరివర్తనమును గొనితెచ్చిన సత్యవాక్యవిజయ మీకావ్యమున నన్నిటికన్న మిన్నగా నద్వితీయముగా నద్భుతముగాఁ గొనియాడఁబడినది, మదనరేఖచరిత్రము, గోవ్యాఘ్రసంవాదకథ పుష్పగంధి చరిత్రమును శాశ్వతముగా సారస్వతమునకు జీవము నీయఁగలవు.

భోజరాజీయమునందు మొత్త మేడాశ్వాసములును, రెండువేల తొంబదిరెండు పద్యములు (గద్య, పద్యములు) నున్నవి. భోజరాజీయమునందలి వర్ణనములు సంక్షిప్తములయ్యును హృదయంగమములుగా నున్నవి. పౌనరుక్త్యము కాన్పింపదు. అల్పములగు విషయములందును దగు జాగరూకుఁడై కవి వర్ణించియుండుట చూడఁగలము.

ముఖ్యముగా మూషకవనితావృత్తాంతముసహజముగా వర్ణింపఁబడినది. "అచ్చిఱుతయెలుక తన తోఁ అటలోననయుండి వెలుపలికిఁ దనమూతి సాఫుచుం దలచూపి మరలందిగుచుచు..." వని దాని చేష్టావర్ణనమే కాక మూషకవనితా యౌవనాగమ వర్ణనమెంత సాజముగానున్నదో చదివినఁగాని వదలనీదు.

"దానికి నెలప్రాయంబు సొచ్చుడు నూఁగుదోసపిందె గతిసందంబగు దేహంబును దరుణశాకినీ మూలంబునుబోలు వాలంబును శాల్మలీతూలకంబళంబు విధంబున నత్యంతమృదులంబగు నుదరంబును నాఖుకర్ణిపర్ణంబులమాడ్కి తిక్కించుకొనియున్న కర్ణంబులును నలంతి పూసలనంటించినట్లు దనరు కనుంగవయును నుచ్చింతపూవులలోని కేసరంబుల క్రియ భాసురంబగు పలువరుసయుఁ దన వయోరూపంబున కనురూపంబులగుచుండఁ జెలంగి నెలగొమ్మలెక్కి వ్రేలుచుబలిష్ఠంబులగు తిర్యక్శాఖలపైఁ దుళ్ళిగింతలు పెట్టుచు నాకుఁజొంపములు సొచ్చి దాఁగుచు నిటు బహువిధంబుల విహరించుచుండు నమ్మూషక యోషంజూచి యొకమూషక పురుషుండు వివశాంతఃకరణుఁడయ్యె"

ఇట్టివర్ణనములందుఁ గవియొక్క క్రాంతదర్శిత్వము కానగును గోవత్సముల సంభాషణము నిటులే సహజముగానుండి మాతృవాత్సల్యముతో నిండియున్నది. కర్కటబాలుని జన్మవృత్తాంతములు, మునిచే శప్తురాలయి శునిగా జన్మించిన నిషాదిచరితము, పందిపిల్లగా జన్మించిన మునికథ మొదలగునవి యాయా జాత్యనుగుణములగు సమగ్ర వర్ణనములతో నిండియున్నవి. తిర్యగ్జంతువుల భావచేష్టాదులను గనులకుఁగట్టినట్లు వర్ణించుటయం దీ కవి సిద్ధహస్తుఁ డనవలయును.

తక్కిన వర్ణనములలో సూర్యాస్తమయ చంద్రోదయవర్ణనములు, వనవిహారవర్ణనమును రమణీయములు. ఆంధ్రకవు లందఱవలెనే

ప్రాచీనసంప్రదాయానుసారముగా బహుళవర్ణనములను జొప్పించి యున్నాఁడు కాని వానిని బొడిగించుటయు నాశ్వాసముల కొలఁది నింపుటయుఁ జేయలేదు. ఇతనికవితకుఁ దక్కినయలంకారములకంటె స్వభావోక్తియే వన్నెదెచ్చియున్నది. స్వభావోక్తిని మృదుశైలిని వీడనంతవఱకితని కవితహృదయాకర్షకముగా నున్నది.

"తరుణీరత్నము పువ్వుఁదీఁగె నొకచేతన్ వంచి పాదాగ్రమున్
ధరణిన్ మోపి రెుుకింతనిక్కి తనుమధ్యం బొప్పఁ గత్నుద్వయ
స్ఫురణంబారఁ గుచంబు లుబ్బ నయనంబుల్ విచ్చి లీలన్ ముఖాం
బురుహం బెత్తి రెుుకర్తుఁగోసె నెలమిన్ బుష్పంబులత్తోఁటలోన్."

ఇతని కవిత లీలారసవిలసన విదగ్ధయగు ముగ్ధాంగనవోలె హృదయశుద్ధికలిగి డెందమున కానంద మొడఁగూర్పఁ జాలియున్నది. సరసములగు మధురోక్తులతో రసికుల నలరించుట తప్ప జిగిబిగులతో మహార్థాలంకారములతోఁ జిత్రవిచిత్రబంధములతో మనముల వివశ మొనర్చుట యితని కవితాకన్యకుఁ జేతగాని పని.

భోజరాజీయమునఁ బ్రధానరస మద్భుతమని చెప్పవచ్చును. తదంగములుగా నాయా రసము లాయాచోటుల నభివర్ణితములు. పుష్పగంధీ రత్నమండనుల సన్నివేశమున శృంగారరసము, బమ్మెరక్కసి దర్శనమప్పుడు బీభత్స, భయానకములు, గోవువత్సమును వీడునపుడు కరుణరసము, పావకలోమ రాక్షసుల యుద్ధసందర్భమున రౌద్రరసమును బ్రధానరసమగు నద్భుతమునకుఁ బోషకములై యున్నవి.

"బే యనుఁ దల్లీ నీవెట
పోయెద వను నన్ను డించి పులివాఁతఁబడన్
బోయెదవే యనుఁ జెల్లం
బోయను నింకేటిబ్రతుకు పోనాకుననున్."

అను నీపద్యము చూడ తల్లిని వదలలేక యేడ్చునప్పటిది. కరుణరసావిలము. అనంతామాత్యుఁడు తత్తద్రసములను దనశక్తి కొలఁది పోషించినాఁడు. మనుజుల చిత్తవృత్తులను వర్ణించుటకక్కడక్కడఁ బ్రయత్నించి కృతకృత్యుడయ్యెనుగాని కావ్యమంతటనద్దానిని జూడలేము. సజీవపాత్రచిత్రణమనినఁ దిక్కనాదులగు నేయిర్వురు మూవురకో తప్పఁ దక్కినవారికి సిద్ధింపలేదు.

కొన్నితావులఁ బూర్వకవుల యనుకరణములు క్రీనీడలవలె నిందుఁ గన్పించుచున్నను నితని ననుకరించినవారును దరువాతి ప్రసిద్ధ కవులలో నున్నారు. అనుకరణమనునది పూర్వగ్రంథపఠన సంస్కారమువలన యాదృచ్ఛికముగఁ బడవచ్చును.

మగఁ డెఱుఁగవలయుఁ గా దేని
మగువ యెఱుఁగవలయుఁగాక మనుగడ తెలఁగ
మ్మగువయు మగఁడును వెలిగా
జగమున సంసారమెట్లు జరగును జెపుఁడీ"

మున్నగు పద్యములు సరళములై పింగళి సూరనాదులకును ననుకార్యము లయినవి. కవిత్రయము తరువాతఁ బ్రసిద్ధులయిన తెలుఁగుకవులలో నితఁడొకఁడు. వైష్ణవధ్యాన సమాహితాత్ముఁడు. శివకవుల శైవమువలె నితని వైష్ణవము ముదురలేదు. "హరహర మున్న నాదగు మహాశ నిరాశముఁ జేసి..." "శివశివ" మున్నగు సూనిక మాటలను వాడుటయుఁ, గాశీవర్ణనము, విశ్వనాథాలయ వర్ణనము శివప్రార్థనము మొదలగునవియును గవియొక్క సమత్వమును విశాలహృదయమును వేనోళ్ళఁ జాటుచున్నవి. విష్ణునందమిత తాత్పర్యము గలవాఁడయ్యు నీశ్వర ప్రార్థనాది ఘట్టములను సమత్వ బుద్ధితో వర్ణించెను.

కథోపకథాత్మకమైన యీ వాక్యమునందలి పాత్రముల యౌచిత్యమును జర్చించుట యంత తేలికగా నగునదికాదు. ఇందుఁ బెక్కు పాత్రములు లోకాతిశాయి గుణములు గలిగి, కవియొక్క భావనా ప్రపంచమున సృజింపఁబడి నీతినియమములచేఁ బెంపఁబడి యీలోకమునకుఁ గొనిరాఁబడినవారు. పాత్రములందు సహజత్వముకన్నఁ గృతకత్వమే యధిక మనిపించును. దేశకాల విరోధములును గొన్ని కన్పించును. భోజనమువేళ యయినప్పుడు మొదలిడిన భోజసర్పటి సంవాద మాశ్వాసములు నిండిన కథలతోఁ గాని పూర్తికాదు. అభూతకల్పనలతో నిండిన చిత్రవిచిత్రములగు కథలు చదువుచున్నంత సేపు నుత్కంఠ కలుగఁజేయుచుఁ బొత్తము తుదిముట్టువఱకు నూరకుండనీవు. కథారూపమున నీతులను బోధించుటయు వినోదము కలిగించుటయుఁ బ్రధానాశయములై నందున నీ కావ్యమందు దేశకాల విరోధాదులంత పాటింప నక్కఱలేదేమో ?

కథానాయకుఁడనఁబడు భోజుఁ డాదిరాజసన్నిభుఁడయ్యును కేవలము కథలను బదిమందికిఁ దెలియఁజేయుట కాధారమగు శ్రోతగాఁ బరిణమించెను. మోసము చేసి ధూమవేధి విద్యను గ్రహించి, యనపత్యుఁడుగా శప్తుఁడై శాపముగ్రమ్మఱింపఁ బ్రార్థించి చివరకుఁ బుత్రుల ననంతగుణాఢ్యులఁ గాంచెనఁట. సర్పటి యన్నను మోసముచే విద్యను సంపాదించి తాను మోసగింపఁబడినయోగి. క్రోధవశమున శపించినను మరల మన్నించి శాపము గ్రమ్మఱించి చక్కని కథలను జెప్పిన పౌరాణికుఁడు. ఉపకథలలో ముఖ్యులగు పుష్పగంధీరత్నమండను లాదర్శ దంపతులు. చూచిన మాత్రమునఁ బరస్పరము హృదయము లప్పన మొనర్చికొనిన సరసులు, కోమల హృదయులు. అన్నదానపరుఁడగు విప్రుఁడు, వంజరుఁడు, మహుఁడు మొదలగు పాత్రములు నీతిని బోధించుచుఁ దాము కల్పింపఁబడిన యావశ్యకతను దీర్పఁగలుగు

చున్నవని యొప్పుకొనవచ్చును. ఆకాశమునకు నిచ్చెనలు వేసి కథల నల్లి కృతకృత్యుఁడయిన యనంతామాత్యుఁడు కల్పనాచాతుర్యము నకుఁ గథలోఁ గథను గూర్చుటకును మెచ్చఁదగియున్నాఁడు. ఇతని కావ్యము "వ్యవహార లక్షణం బెఱిఁగెడికొఱకు ననేకవిధములగు నమంగళముల హరియించుకొఱకు నుచిత నిత్య సౌఖ్య సంసిద్ధికొఱకు నొనరఁ గాంతా సమ్మితోపదేశంబునఁ బ్రీతిమై హిత మాచరించు కొఱకు" "ఆనడుమ ధర్మరీతులు నీతుల్ చిత్రకథలై తలిర్పఁగ శ్రోత్ర సుఖముగా నొనర్పఁ జొప్పడియుండున్" అను ప్రతిజ్ఞానుసారముగా రచింపఁబడినది. 'బాలకి' 'చేతురు' మొదలగు కొన్నిపదముల నీ కవి తఱుచుగా వాడియున్నాఁడు.

"చచ్చునంతటి కలఁగన్న నోలి మేలుకొనిమె యుండవలయు" "ఉడుము నడికియున్న నడుమనె బడపెట్టు" 'పులియున్న పొదరింటి పొంతఁ జనుట' 'తలియఁబెట్టిన యశనంబు తలఁగఁద్రోచి పిడపఁ గుడిచెద ననువాఁడు బేలకాఁడె' 'పఱగడుపున బొంకఁగ నోపను' 'ఆవగింజంత భూతి పూయువానికి గుమ్మడికాయయంత వెఱ్ఱిగలదు' 'ఎవ్వరికిని మీఱరా దజుఁడు వ్రాసిన వ్రాలు' 'చెప్పెడివారు చెప్పినన్ వినియెడి వారి కించుక వివేకము పుట్టదె యింతయేనియున్' 'తరితీపుచేసి' 'జాదులును హరి ప్రసాదంబునైన నే చంపమిదియు నట్టిచందమయ్యె' 'పులికిం బుట్టిన కూనయుఁట లేఁడి పులు మేసెడినే ? మొదలగు సామెతలను బదబంధములను గావ్యమంతట నింపినాఁడు.

తిక్కన సజీవపాత్ర చిత్రణము, శ్రీనాథుని యనర్గళ కవితా ధార, యల్లసాని వారి యల్లిక జిగిబిగి మొదలగునవి కాన్పింపకున్నను సమకాలీనులగు జక్కనాదులకుఁ దీసిపోఁడు.

"తావిఁగొనని పుష్పదామంబు విధమునఁ
జిదుమఁబడని మావిచిగురు భంగిఁ

డాగింబడని నవసుధాధార పగిదిని
జెలువు జూడ సురత చిహ్నలేదు

మొదలగు ననేకపద్యము లీకావ్యమున రత్నములవలె మెఱయుచుఁ బాఠకుల మనముల నలరింపఁగలుగుచున్నవి. తరువాతి కవులనేకులు 'స్వీయత' (Originality) యనునది లేక కేవలము వెనుకటి కావ్యములకు నీడలవంటి గ్రంథములను సృజించిరి. ఇతఁడట్లు కాక స్వీయత, కల్పనాశక్తి, ప్రతిభయును గలిగినవాఁడై, స్వతంత్ర కావ్యమును సృష్టించిన దిట్ట.

నును లేఁత వెన్నెల కొనలు మెల్లనఁ ద్రుంచి
పిల్లతండమునకుఁ బెట్టు నవియుఁ
జవిదైన వెన్నెల చందులఁ గబళించి
యింపారఁ బ్రియుల కందిచ్చునవియుఁ
గడఁగి యింతటఁ గాని వడదేర దను భంగిఁ
దనర వెన్నెల వెల్లి మునుఁగునవియుఁ
బగలింటి యాఁకలి పాయఁ బైఁబై బడి
ముమురు వెన్నెలఁ గ్రోలి పొదలునవియుఁ
గడుపుఁ నిండినఁ గసి కాటు కఱచునవియుఁ
గూడి యొండొంటితోఁ జెలలాడునవియు
నగుచు వెన్నెల తమ సొమ్మె యనిన యట్లు
కోరి చరియించెఁ జదలఁ జకోరచయము

అనునది తెనుఁగు సారస్వతమునందలి వెన్నెల వర్ణనములలో ముఖ్యమైన పద్యము దీనిని ముక్కు తిమ్మనయు ననుకరించె ననుటయే దీనికిఁ దార్కాణము.

ఒకరాజు శాకునికునితోను దదితర పరివారముతోను వేఁట కేఁగును. అచ్చటఁ గట్టెలు కొట్టుకొనఁబోవు నొకనిని జూచి శకున

జ్ఞుఁడు 'వాఁడు నేఁడింటికి వచ్చులోపలఁ బాముకాటుచే నడవిలో మరణించు' ననును. కాని వాఁడు దైవవశమున సురక్షితుఁడై కట్టెల మోపుతోపాటు వీరి కెదురుపడును. అప్పుడు రాజు శకున శాస్త్రజ్ఞనితో-

"చంపంగ వచ్చిన జముని దూతలకు లం
చము పెట్టి వచ్చెనో, చావనొల్లఁ
బొమ్మని మోఱకంబునఁ ద్రోచి వచ్చెనో,
యింటి వారికిఁ జెప్ప కిచటఁ జచ్చి
నట్లైనఁ గోపింతురని చెప్ప వచ్చెనో,
పేని పెంజెమట నవిషము గరఁగి
పడిసెనో, సర్పంబు పాతప్పి పోయెనో,
శకునశంపుఁ బలుఁగు లీసారి బిగిసి
తప్పఁ జెప్పెనో; యితండేమి విధమున
బ్రతికి వచ్చె? ... ... ... " అనును, ఇది మృదుహాస్యస్ఫోరకమయి ... ... ... చమత్కారముగానున్నది. తన కవిత్వము "తొంటి పెద్దల కవిత్వము పోలె రుచించు నొకొ" యని సందియంపడి చిన్న బిడ్డల వెడతొక్కుఁ బల్కులు దృఢంబగు ముద్దుల నీనకుండునే" యని విన్నవించుకొనిన యితని సౌజన్యము ప్రశంసార్హము.

"అఖిల జగత్సేవ్యమై భూమిపై నసహో
బలము దా నెందాఁక వెలయుచుండు
నయ్యద్రి శిఖరంబునందును నెందాఁక
శ్రీనృసింహస్వామి స్థిరతనుండు
నస్మదీయకృతియు నందాఁక సంతత
శ్రావ్యమై సమస్త సభలయందు

విస్తరిల్లఁగాఁత వివిధ కథానూత్న
రత్నభూషణాభిరామ మగుచు"

అని తన కావ్యము శాశ్వతముగా నుండవలయునని యహోబల నృసింహునితో ముడిపెట్టియున్నాఁడు. వస్తుతత్త్వమువలనఁ గాకున్నను కృతిభర్తయుత్తమత్వము వలననైనఁ దనకావ్యము ప్రసిద్ధికి రానాశించుట కవులకు సాజము. ఏ కవి తనకృతి శాశ్వతముగా నుండ నాశింపఁడు ?

సహజమగు కవితాధార, సందర్భోచిత వర్ణనములు, మృదుపదములును గల యితని కావ్యము స్వభావోక్తులతో నిండి కల్పనాచిత్రితమయియున్నది. తెనుఁగు సారస్వతమునఁ బ్రతిభతో స్వతంత్ర కావ్యమును నిర్మించిన ఖ్యాతి యనంతునకుఁ బ్రత్యేకము. కేవల కావ్యమునవలె నానందజనకమగుటయే కాక పురాణమువలె నీతిబోధకమయి ధర్మప్రతిపాదకమై యుండవలయుననుట యితని గాఢవాంఛ. "కృతియ చూ నిత్య కీర్తికి గతి" యని తాను జెప్పికొన్నట్లు కీర్తిభాజనుఁడయి సఫలత నొందెను.

"గాఢ నీహారంబు గప్పినఁ దప్పునే
మార్తాండ బింబ విస్ఫూర్తి పెంపు" (భో. రా.)

అనినటు లనంతామాత్యుని సహజ ప్రతిభ, కల్పనాశక్తియు భోజరాజీయమునం దెల్లెడలఁ బాత్రముల మాటునఁ గథాగర్భమునఁ బ్రకాశించుచునే యున్నవి.

---

# ప్రబోధచంద్రోదయాంధ్రీకరణము

గాండీవి

శ్రీనాథయుగమునకుఁ జెందిన నందిమల్లయ ఘంటసింగయలను జంటకవులు కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయ రూపకమును శ్రావ్య ప్రబంధరూపమున నాంధ్రీకరించినారు. ఈ జంటకవులు ప్రబోధ చంద్రోదయమునే కాక వరాహపురాణమును గూడ రచియించి యున్నారు. ఆంధ్ర వాఙ్మయమున మొట్టమొదటి జంటకవులు వీరు. వీరిని గూర్చిన చారిత్రిక విషయము లాంధ్రకవి తరంగిణ్యాదులద్వారమున నెఱుఁగనగును.

నన్నయ, భారతమును గూర్చి ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని" ఇత్యాదిగాఁ జెప్పినట్లు ప్రబోధ చంద్రోదయ కర్తలు తమ కృతిని గూర్చి యిట్లు చెప్పినారు.

సీ॥ వివరింపనిది సర్వవేదాంత సారంబు
తలఁపఁగానిది గట్టి తెలివిత్రోవ
యిదిభోగమోక్ష సంపదలకు మూలంబు
మోసవేదిది ఘనంబులకు ఘనము
జ్ఞానకర్మ రహస్య సాధనంబును నిది
యిదినవరసముల నీను సురభి
షడ్దర్శనంబులు సరవి నిండున్నవి
సందేహములుదీఱ విందుఁగాని

గీ॥ ఇమ్మహారస పాకము నెఱిఁగినట్టి
జనుఁడెఱుంగఁడు మఱితల్లి చన్నుఁబాలు
దీని సరిచెప్ప మఱిలేవు త్రిభువనముల
దొరక దీకృతి నీవంటి దొరక కాని

(దొరకుఁ గాని - ముద్రితపాఠము)

ప్రబోధ చంద్రోదయము శాంతరస ప్రధానము. శాంతము రసమా ? కాదా ? యను విషయమున నాలంకారికులు పెక్కు-

చర్చలు చేసియున్నారు. తుదకు శాంతము రసముగా సిద్ధాంతీకరింపఁబడుటయే కాక దృశ్య శ్రవ్య కావ్యముల రెంట ననుసంధింపవచ్చు ననియు నిర్ణయింపఁబడినది. "ఇమ్మహారసపాకము నెఱిఁగినట్టి జనుఁ డెఱుంగడు మఱితల్లి చన్నుఁబాలు" అని చెప్పఁబడుటకుఁ గారణము ప్రబోధ చంద్రోదయము శాంతరసప్రధానమగుట చేతనే. శాంతము నకు స్థాయిభావము తృష్ణాక్షయ సుఖము "శాంతశ్చ తృష్ణాక్షయ సుఖస్యః యఃపరిపోష స్తల్లక్షణోరస ప్రతీయత ఏవ" ఆనందవర్ధనుఁడు. వీతరాగులకుఁ బునర్జన్మ భయము లేదు. "వీతరాగజన్మాదర్శనాత్" అభినవగుప్తుఁడు. యభిప్రాయమునే పై ప్రబోధ చంద్రోదయపద్య పాదములు వ్యక్తీకరించుచున్నవి. ప్రకృతపద్యముననే శాంతము "నవ రసముల సీనుసురభి"గాఁ జేర్కొనఁబడినది "భావావికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతిర్మతః, వికారః ప్రకృతే ర్జాతః పున స్తత్రైవలీయతే" ఇత్యాదివచనము చొప్పున శాంతమునుండి నిమిత్తము ననుసరించి యితరరసము లుద్భూతము లగుచుండును. కావున 'ఇది నవరసముల సీనుసురభి' అనువాక్య ముచితమే.

ఈజంటకవులు శ్రీనాథుని స్వతంత్రానువాదమునే మూలముగాఁగొని యీనాటకము నాంధ్రీకరించినట్లు చెప్పవచ్చును. ఆంధ్రీకరణవిధానమును దిఙ్మాత్రముగాఁ బ్రదర్శించుటకీ వ్యాస ముద్దేశింపఁబడినది.

I మూలమున వచనములోఁ జెప్పఁబడిన భాగములు పద్యముల లోనికి మార్చుట, పద్యములలోఁ జెప్పఁబడినభాగములను గొన్నియెడల వచనములలోనికిఁ బరివర్తించుట కననగును.

1. ఆర్యపుత్ర, నూనమన్ధకారలేఖయా సహసైవ శ్మేస్తిరస్కారః
యథామాయయా తథా స్ఫురన్మహాప్రకాశ సాగరస్య దేవస్యాప్యభిభావః"

ఆ. మేఘరేఖయొకటి మిహిరునికడ్డంబు, వచ్చినంతనతనివన్నె చెడునె?
మాయడాయనతనిమహిమంబుతప్పునె, యబలయట్లుతప్పదైననినుము

2. శ్లో. ఉత్తుంగపీవరకుచద్వయ పీడితాంగ
మాలింగితః పులకితేన భుజేన రత్యా
శ్రీమాం జగంతి మదయ న్నయనాభిరామః
కామోఽయ మేతిమదఘూర్ణితనేత్రపద్మః. (1-10)

రతిసముత్తుంగకుచాంకితరోమాంచకంచుకితాంగుండునునుదఘూర్ణితా
పాంగుండును సకలజగన్మోహనాకారాభిరాముండునునగు కాముండు
(1-45)

II ఆంధ్రీకృత పద్యములమధ్య స్వతంత్ర పద్యపాదములు జొనిపి పద్యమును బూర్తిచేయుట స్వతంత్రాంధ్రీకరణములలో నేత్రవిషయీభావమును భజించుచుండును.

శ్లో. అహల్యాయైజారః సురపతి రభూ దాత్మ తనయామ్
ప్రజానాథోఽయాసీ దభజత గురో రిందు రబలామ్
ఇతిప్రాయః కోవా నపద మపథేఽకార్యత మయా
శ్రమో మద్బాణానాం క ఇవభువనోన్మాదవిధిషు (1-14)

సీ. తనకన్నకూఁతును దానపెండ్లాడఁడే ?
వారిజగర్భుండు వావితప్పి
బలభేదిగౌతముభార్య నహల్యఁ గా
మించి చేయఁడె నల్లమేఁకతప్ప ?
కడలేనిరట్టులకోడి గట్టికొనియైనఁ
గమలారి గురుతల్పగతుఁడు కాఁడె ?
తపసనూనుఁడు తారఁ దానాక్రమింపఁడే
యన్నప్రాణములకు నట్టుఁ దలఁచి
గీ. మఱియునిట్లు జగంబుల మరులుకొల్పి
మెట్టనియతాత్మకులనైన గుట్టుచెఱిచి
కానితోవల నడిపించు కడిమివాడు
వాలుఁదూపులగమి కవలీల గాదె. (1-50)

ఈసీసమునందలి చతుర్థపాద మమూలకము. నాల్గవపాదమునఁ దారగూర్చియే వ్రాయనేల? మూఁడవ చరణమున "కమలారి గురుతల్పగతుఁడు కాఁడె" అని చెప్పఁబడినది. గురుని భార్య తారకదా! అందుచే నాల్గవపాదమున నామసామ్యముచే స్ఫురించి మనజంటకవులు తారసుగ్రీవుల ప్రసంగములోఁ బద్యపాదమును బూరించిరని యూహింపనగును. ఈపద్యమునందలి "నల్లమేకతప్పు" అనునది వ్యభిచారార్థకము 'నల్లమేకతప్పు' అనునది చీఁటితప్పు' వంటిది చీకటితప్పు చేసిన సరోరుహనేత్ర, గూబయై చరియించుఁ గోటరమున' కాశీఖండము. 'నల్లమేక' చీకటి కుపలక్షకమని మనజంటకవులు తలంచి యుందురు.

III మూలశ్లోకములను వివరణ ప్రాయములుగాఁ దెనిఁగించుట కొన్నిపట్టులందుఁ గన్పట్టును.

శ్లో॥ సమ్మోహయంతి మదయంతి విడంబయంతి
నిర్భర్త్సయంతి రమయంతి విషాదయంతి
ఏతాః ప్రవిశ్య సదయం హృదయం నరాణామ్
కింనామ వామనయనా న సమాచరంతి (1-27.)

సీ॥ వన్నెలుపచరించి కన్నుసన్నలు చేసి
వెడమాటలను ప్రేమఁ గడలు కొలిపి
తరితీపునటనలఁ దమకంబుఁ బుట్టించి
వట్టిప్రియంబుల గుట్టుఁదెలిసి
కలికితనంబునఁ గాకలు గావించి
తోడిసీడలపోలెఁ గూడిమాడి
యలుకలనలయించి కలయిక వలపించి
బాసల నడియాన పాదుకొల్పి

గీ. మనసుఁ గరఁగించి భ్రమయించి మస్తరించి
మిగులఁ జొక్కించి యెంతయుఁ దగులుపఱిచి
పాసి యెడఁబాసి తమబంటుఁ జేసి కొనరె
వామలోచన లెంతటివారినైన (1-75.)

మూలశ్లోక భావమును వివరించుటయే కాక సమ్మోహయంతి మదయంతీ' త్యాదిగానున్న శ్లోకమునందలి శబ్దపాటవమును గూడ నెత్తుగీతిలో సంపాదించుటకుఁ బ్రయత్నించిరి. 'కరఁగించి, భ్రమయించి మస్తరించి, చొక్కించి, పాసి, యెడఁబాసి, చేసి'' అనునవి సమ్మోహయంతీ'ద్యాదులకుఁ బ్రతిగాఁ గూర్పఁబడినవి. శ్రీనాథుఁ డైనచో మూలమునందలి సమ్మోహయంతీ ద్యాదులనే యథాతథముగా గ్రహించి సరిపెట్టియుండెడివాఁడేమో ? ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రలో "దంభోళిధర సతీతాంబూల పేటీషు, దహన బింబాధరీస్తనభ రేషు—చంద్రశకలంతి హారంతి చందనంతి'' ఇత్యాదిగా వ్రాసియున్నాఁడు.

IV మూలశ్లోకముల నాంధ్రీకరించుచుఁ దెనుగుసామెతలు మున్నగు వానిని మధ్యమధ్యఁ జేర్చుచుండుటకలదు.

(1) "భణతావత్ క్షణవినాశినా త్వయా కస్య కృతే ఇదంవ్రతం ధార్యతే''

గీ. క్షణవినాశివాఁడు గద నీవు మఱి నీకు
నిట్టివ్రతములెల్లఁ బట్టనేల
రెండిటికిని జెడిన రేవఁడవై వృథా
బోడవైతివెందుఁ గూడవైతి. (3-21.)

ఈ పద్యములో రెండిటికిని జెడిన రేవఁడ యను నది స్వతంత్రముగాఁ జేర్పఁబడినది. పయుశ్శ్రీచన రెంటికిన్ జెడినరేవడ నాదునె

నీరజేక్షణా" అను మనుచరిత్ర పద్యపాదమున కిదియే మూలమేమో!*

(2) "అఃపాప, స్వయంనష్టః పరానపి నాశయితు మిచ్ఛసి"

"ఏమిరా తాఁ జెడ్డకోమటి వెనకయ్య
చేతికి వెసలయిచ్చిన విధమున
మమ్ము మీమతముఁ గైకొమ్మని చెప్పెదు" (3-29.)

'స్వయం నష్టః పరానపి నాశయితు మిచ్ఛసి" అను మూలభావమును దెలుపు 'తాఁజెడ్డకోమటి వెనకయ్యచేతికి వెసలయిచ్చిన విధమున" అనుదాని ననుసంధించిరి. ఉత్తర హరివంశమునందలి "స్వయం నష్టః పరాన్నాశయిష్యతి యత్నః" అనునదే కృష్ణమిశ్రుని వాక్యమునకు మూలము కానోపును. నాచన సోమనాథుఁడు "తాఁజెడ్డవాఁడు, వెనకయ్యచేతికి వెసలిచ్చె ననుమాట నిజముగా"(ఉ.హ.) అని యాంధ్రీకరించి యున్నాఁడు. ఈ సోముని యాంధ్రీకరణమే ప్రబోధ చంద్రోదయ కర్తలచే ననుసరింపఁబడి యుండును.

V మూలానుసారముగా వృత్తౌచిత్యముకూడ నీ జంటకవులు పాటింపఁ జూచినట్లు చెప్పవచ్చును. మచ్చునకొక్క యుదాహరణము.

శ్లో॥ సదసముపగతోఽహం పూర్వ మంభోజయోనేః
సపది మునిభిరుచ్చై రాసనే ష్వాశ్రితేషు
సశపథ మనునీయ బ్రహ్మణా గోమయాంభః
పరిమృజిత నిజోరావాసు సంవేశితోఽస్మి (2-10)

మత్త॥ ఏను మున్నొకనాఁడు పద్మజు నింటికేఁగినఁ గొల్వులో
మౌనులెల్లరు లేచిరప్పుడు మమ్ముఁజూచి పితామహుం

---

* ఈసామెతను అనుభవసారమునఁ బాలకురికి సోమనాథుఁడు మొదట వాడినాఁడు. అతఁడు పదిరెండవ శతాబ్దివాఁడు. (సం)

డానవెట్టి ప్రియంబుఁ జెప్పుచు నంబుగోమయ మార్జితం
బైనయట్టి నిజోరు పీఠికయందు నిల్పెఁడె వాపుసున్ (2 21)

VI రసానుగుణముగ మూలశ్లోకములలోని శబ్దపాటవము నకు మెఱుఁగుఁబెట్టుచుఁ బద్యములు రచించుట గోచరించుచున్నది.

(1) ఏతత్కరాళ కరవాల నికృత్తకంఠ
నాలోచ్ఛలద్బహుళ ఫేనిల బుద్బుదాఢ్యైః
సార్ధం డమడ్డమరు ఘాంకృతి హూతభూత
వర్గేణ భర్గ గృహిణీం రుధిరై ర్ధినోమి (3-15)

ఉ॥ జొత్తిలు నేత్రకోణములఁ జూచుచు నోరి దురాత్మ కత్తి నీ
కుత్తుకఁగోసి బుద్బుద విఘూర్ణిత ఫేనిలమైన నెత్తుటన్
బుత్తరమొనర్తు దుర్గకుఁ బ్రభూతడమడ్డ మహారు ఘాంకృయో
ద్వృత్తను రోమహర్ష నటనారభటీపటు భూతవర్గకున్ (3-39)

శ్లో॥ సజ్జన్తాం కుంభభిత్తిచ్యుత మదమదిరామత్త భృంగాః కరీంద్రాః
యుజ్యంతాం స్యందనేషు ప్రసభజిత మరుచ్చండ వేగాస్తురంగాః
క్షిప్తై ర్నీలోత్పలానాం వనమికుకభామంతరాళే సృజంతః
పాదాతాః సంచరంతు ప్రసభ మసిలసత్పాణయో హ్యశ్వవారాః (4-25)

సీ॥ కటితటీకటదాన గంధ భ్రమద్భృంగ
భీకర కరిఘటా బృంహితముల
భీషణవిద్వేషి వేషి యథోచిత
వేషఘోటక ఘోర హేషితముల
ధనురాది వివిధాయుధ ధ్వజాధిష్ఠిత
నిష్ఠురస్యందన నిస్వనముల
ఖడ్గ మయూఖాంధకారితాశాముఖ
వీరభట ప్రోద్భటారభటులఁ

సీ॥ గాహతీరవ భేరీభాంకారములను
గంచుకివ్యూహ భూరి హుంకారములను
బ్రహ్మాండంబు బీటలు వాఱుచుండ
దశదశాంతలు చక్రితిర్ధంబువెడలి (4-37)

ఈ జంటకవుల శివభక్తి :— 'శివ శివభ్రాంతిగాని యశుచి ప్రతిపాట మెటింగఁగెటింగియున్' (4-7) అనుచోటి శివస్మరణము 'చందన మరాళ బిసకుంద ధనశాంగు గిరిమందిరు సుమారమణు సింధుధరుఁగానీ' అనుచోటి యమూలక శివప్రసంగము (5-32) వీరి శివభక్తికిఁ దార్కాణము.

ముద్రణము :— ప్రబోధచంద్రోదయము చెన్నపురి చింతామణి ముద్రాక్షరశాలలో 1900 లో ముద్రితమై ప్రకటింపఁబడినది. పునర్ముద్రణభాగ్య మీకృతికి లభింపకపోవుట శోచనీయము. పరిషత్తువారైనను దీనిని సంస్కరించి ముద్రించినచో బాగుండునని నా యభిప్రాయము. ముద్రణ స్ఖాలిత్యములు మున్నగునవి గలవు.

(1) క. మలమయపుంగల పిండము
కలజలధుల నీళ్ళనెల్లఁ గడగినఁదాని
ర్మలమగునే ... (3-14) మలమయపుద్గలపిండే సకల జలైరపి కీదృశీశుద్ధిః అని మూలమున నుండుటచే 'మలమయ పుద్గల పిండము' సరియైన పాఠము కానోపును.

(2) 'లీలావతారుండ వౌదింతియేకాక' (4-46) 'ఇంతియ, ఇంతె, ఇంతే' అనునవి యవధారణరూపములు. 'ఇంతియ యను నవధారణముపై మరల 'ఏ' అనునవధారణము పరమై 'ఇంతియ+ఏ= ఇంతియే' అయ్యెనా ? యని యాలోచింపవలసియున్నది. "ఏవావ్యయసమానార్థ మేత్వ మత్వంచ దృశ్యతే" అను నథర్వణ కారిక చొప్పున 'అ-ఎ-ఏ' లవధారణములనుట స్పష్టము. అర్థదార్ఢ్యమునకై

యివి పునరుక్తులగుట కలదు. "దరికోని తెగఁగాల్చునట్టి దయ యగుఁ జుమ్మీ" (ఉద్యో 2-197) "పరమ తత్త్వామృతంబయ చన్నుఁబాలు (బసవ) అను తిక్కన; సోమనల ప్రయోగములలో 'అట్టిద+అ; అమృతము+అ" అనురీతి నవధారణార్థక పునరుక్తి కన్పట్టుచున్నది. ఇట్లే 'ఇంతియే' సాధువు చేయవచ్చునని తోఁచుచున్నది. లేదా 'లీలా వతారుండవాడు వితయకాశ' కవులపాఠమనుటకును వీలుకలదు.

ఈవిధముగా యీ పాఠాదులను బరిశీలించి ప్రబోధ చంద్రోదయమును బరిష్కరింపవేడుచు నీవ్యాసమును ముగించుచున్నాను.

---

# కుచేలోపాఖ్యాన పరిశీలనము

వి. వి. సుబ్బారాయశాస్త్రి.

అష్టాదశ పురాణములలో నుత్తమస్థానము నలంకరించిన భాగవత మహాపురాణమును శ్రీ వేదవ్యాసమహర్షి సంస్కృత భాషలో రచించియుండెను. శ్రీ మహావిష్ణ్వవతార భూతుఁడగు శ్రీకృష్ణుని లీలలు, మానవాతీత విశిష్టవీర్య విలసితములు. వీనిని సహజస్థితిలో వర్ణించుసందర్భమున నెన్నియో కథలు, ఉపాఖ్యానములు వ్యక్తమైనవి. మహాభాగవత దశమస్కంధోత్తరార్ధమున రెండధ్యాయములలో శ్రీ దామచరితము, పృథుకోపాఖ్యానము నను 86 శ్లోకములుగల భాగము ప్రసిద్ధమైనది. ప్రతివ్యక్తియు యావజ్జీవ మనుదినము స్మరింపఁదగిన విషయములెన్నియో యందున్నవి.

ఆ భాగమును శ్రీ పోతనామాత్యుఁడు కుచేలోపాఖ్యానమను పేర చక్కని భాషలో నాంధ్రీకరించి, గజేంద్రమోక్షము, అంబరీషోపాఖ్యానము, రుక్మిణీకల్యాణము ప్రహ్లాదచరిత్రము మున్నగువానితో ప్రతినిత్యము పఠించుకొనఁదగు విషయవైవిధ్యముతో సుసంపన్నమొనర్చెను. కథావస్తువు చిన్నదయ్యును విషయబాహుళ్యముచేత 73 పద్యములుగావ్రాసి యాంధ్రజాతికి మహోపకృతి గావించిన పోతన కవి ఋణమెన్నటికిఁ దీరునది కాదు. తెలుఁగువారి నాలుకలమీద మందారమకరందమాధుర్యము, తెలుఁగుల కంఠమెదుట అలవైకుంఠపురంబు, మనస్సులలో లావొక్కింతయు లేదు, చెవులలో తమహృద్బాష్పల సఖ్యము తాండవించునంతవఱకు తెనుఁగు కాంధ్రలోకము కృతజ్ఞత చాటుచునేయుండును. మూలమునకును, అనువాదమునకును కొన్ని భేదములున్నను కుచేలోపాఖ్యాన మొక విశిష్టస్థాన మాక్రమించినది. పోతనకవి రచించిన రుక్మిణీకల్యాణముగాని, గజేంద్రమోక్షముగాని, మరేదైన కథాసందర్భముగాని తీసికొని పద్యకావ్యముగా మఱొక యుత్తమకవి రచించినను ఆస్థాయి నందుకొనలేఁడు. అది తలంచియే

యేకవిసార్వభౌములో తక్క సామాన్యులెవ్వరు వానిజోలికి పోవలె చిరి. సంస్కృతాంధ్రములలో సునిశిత పాండిత్యముండినమాత్రమునం జాలదు. సహజములగు ప్రతిభావ్యుత్పత్తులుగలిగి మృదుమధుర పద గ్రంథనైపుణ్యముతోం బూర్వజన్మసంస్కృతి లబ్ధోత్తమ కవితావేశ పూరితులైనచో వారేరాణింతురు. "యతిమురాసియు మైలురాళ్ళ వలె నాయాస్థానమందుంచి పద్ధతిగాం జట్రములన్బిగించిన కవిత్వం బౌనె" యనినట్లు జీవభావశూన్యగ్రంథములు వేనకువేలు బయలు వెడలినను రాణింపవు. ఆధునికయుగమున యంత్రసహాయముండుటచే వేవేలప్రతులచ్చువడినను, కాగితముకొఱకు వెచ్చించిన ధనమేని నిచ్చు వారులేక అందెన్ని దూమారుమూలలనణగిచదలకాహారమగుచున్నవి. కొన్ని యంగడులంబడి 'కాఫీ' పంచదారల రుచితోం దృప్తినందుచున్నవి

ప్రాచీనకాలములో నట్లుగాక ప్రజలు భాషాభిమానులై యుత్త మకవికావ్యమాతృకలకు శ్రమకోర్చి ప్రతికలు వ్రాసికొని భక్తిశ్రద్ధల తో నపూర్వగౌరవభావముతో నాదరించెడివారు. ప్రజాదరపాత్రి ములై యున్నతస్థానము నందుకొనందగిన కావ్యములే నాటనాట వెలసి యాగ్రంథ గౌరవముతోపాటు ఆకవి నమరజీవిగాం జేసెడివి. భాష, కవితారీతి, పదగుంభనము, గ్రథనకౌశలము, సమ్మిళితములైన కావ్య ములకొక ప్రత్యేకస్థాన ముండుటనుబట్టియే నన్నయ్య నాటినుండి చిన్నయ్యవఱకు తాళపత్రగ్రంథము లుత్తమములైనవి నామ రూప ములతో నిలువంబడినవి. తక్కినవి నశించినవి. "కతి కవయః కతి కృ తయః కతి లుప్తాః కతి చరన్తి కతి శిథిలాః" అని నీలకంఠ విజయ చం పూరచయిత ఉత్తమకావ్యము లెప్పుడు నిలుచునని తలంచియే తాను త్తమ చంపూరచన చేయుచున్నట్లు వెల్లడించినాడు. అట్టి ఉత్తమ గ్రంథములలో లెక్కింపందగినదిగా భావింపంబడునది మఱొక కుచేలో పాఖ్యానము.

దీనిని రచించిన కవినామకాలాదులలో నెన్నియో విప్రతిపత్తులు కాన్పించుచున్నవి. నాసంశయములను స్థూలముగా వెల్లడించుటయు నొకయుద్దేశమైయున్నది.

కవినామమేమి ? గట్టు ప్రభువు, గట్టి ప్రభువు, ఘట్టు ప్రభువు ఘట్టి ప్రభువు. నాకు లభించిన పుస్తకములలో వావిళ్ళవారు ప్రకటించిన దానిలో "గట్టు ప్రభునామధేయ విఖ్యాతయశుఁడ" అను పద్యము వలనను, ఆశ్వాసాంత గద్యముల వలనను గట్టుప్రభువనియే నిశ్చయమైనట్లు కన్పించినది.

వావిళ్లవారితర్వాత మఱి పండ్రెండేండ్లకు ప్రకటించిన "రామా అండ్ కో" వారు ఘట్టు ప్రభువనియే యంతట నిర్ణయించినారు. ఇంటిపేరు గట్టువారే, ప్రభువు నామధేయ మనువారు కొందఱు. ఇంటిపేరెవరో తెలియదు. ప్రభువనునది అమాత్య, మంత్రి, ప్రెగ్గడలవలె నామాంతమున చేరున దని కొందఱు అందురు. వేంకటేశ్వరులు వేంకటాద్రి మొదలగు పేర్లుగలవారు, కొండ, కొండయ్య, కొండఁడు మున్నగు నామములతో వ్యవహరింపఁబడునట్లు గట్టుపదముతోఁ గూడఁ బిలువఁబడు నాచారమున్నదని మరికొందఱు ననుచున్నారు. ఆంధ్ర కర్ణాటాది దేశచరిత్రలలో మూలమూలల నణఁగి విస్మృతి పాలుగానున్న కవుల గ్రంథములను నామరూపములను వెల్లడించుటకై పూనుకొని కందుకూరి వీరేశలింగంపంతులుగారు ఆంధ్రకవుల చరిత్రమును లోకమున కందించిరి. ఆ గ్రంథములో ఘట్టుప్రభువు అను పేరున నాతని జీవితచరిత్రను వ్రాసియుండిరి. తథాస్తు. ఏమైనప్పటికిని కవినామాదిని గల "గఘ" లనిర్ణయము. తరువాత "ట్టుట్టి"ల నిర్ణయము ముఖ్యమని నాతలంపు కాదు-ఏదియైన నాధారమును బట్టి నిర్ణయింప యత్నింతము.

ఇతఁడేకాలపు వాఁడు? నెల్లూరు మండల చరిత్రాధారములతో 1911

నాటికి నూఱుసంవత్సరముల క్రిందటనుండినవాఁడని శ్రీ కం॥వీ॥పంతులు గారు నిర్ణయించిరి. వారిననుసరించియే కాఁబోలు వావిళ్ల వారు 'నూఱేండ్ల క్రిందట నున్నవాఁడని కవిజీవితము వలనఁ దెలియుచున్నద'' ని ప్రకటించినారు. వీరిరువురు 19వ శతాబ్దారంభమునకుఁ దీసికొనిరాగా, ఆధారమేమియుఁ దెలుపక 18వ శతాబ్దారంభమున నున్నవాఁడనియుఁ దెలియుచున్నద'' ని రామా అండ్ కో వారు 18వ శతాబ్దమునకు పంపివేసిరి. కుచేలోపాఖ్యానమును వ్రాసికొనిన వారి కాలమును బట్టి గ్రంథకాలము నిర్ణయించు నాచారము స్వీకరించుచో నితఁడు 18వ శతాబ్దికిఁ బూర్వుఁడేగాని నవీనుఁడు కాఁడని తోఁచును. ఆకాల నిర్ణయమును గుఱించిన వాదోపవాదములు ప్రకటితములు కావలయును. తాళపత్త్రగ్రంథాధారముగాక, యింకనే వేని నాధారములున్నచో పత్త్రికాముఖమునఁ గాని, మఱేదైనవిధమునఁ గాని బహిర్గత మొనర్ప సభ్యుల వేడికోలు. కవి వైదిక బ్రాహ్మణుఁడా ? నియోగిప్రభువా ? గ్రంథమును సమగ్రముగాఁ బఠించిన తర్వాత నితఁడు వైదిక బ్రాహ్మణుఁడేమో అను ననుమానము కల్గుటచేతనో, బలమైన ఆధారములు లేకపోవుటచేతనో "యాజ్ఞవల్క్యనియోగి బ్రాహ్మణుఁడైనట్లు కనఁబడుచున్నాఁడు" అని శ్రీ వీరేశలింగంపంతులుగారు తమ భావమును వెల్లడించినారు. దానికి తోడ్పడునట్లుగా నీకవి యితర రచనలను గూర్చి తెల్పుచు సురాభాండేశ్వర మను మఱియొక గ్రంథము కూడ నున్నదని యందుండి యుదాహరణగా పద్యముల నిచ్చుచు యాజ్ఞవల్క్య చరిత్రమను మఱొక పద్యకావ్యము కూడ రచించెనని వర్ణించినారు. అందులో నుండి మచ్చున కొక పద్యమేని నుదాహరింపలేదు. ఆ గ్రంథము లభింపనందున ప్రకటన కుపలభ్యము కాలేదనినారు. ఇటీవల ఎవరో ఆ గ్రంథ మున్నదని తెల్పినట్లు వినికిడి. వైదికియో నియోగియో ఎవరైనను బ్రాహ్మణకవియే యనుకొనుచుండఁగా

కాదను వాసు కొందఱు బయలుదేరి క్రొన్నిమార్గములను వెదకు చున్నారు. నామ, కాల, వంశాదులను విమర్శించుటకుఁ గాక ప్రశస్తమగు కవిత్వమును గూర్చి కొలఁదిగా ముచ్చటించుటయే సంకల్ప మగుట నా విషయములను సూచన మాత్రముగాఁ దెల్పినందులకు మన్నింపుఁడు.

కవి తనను గుఱించి చెప్పికొనిన పద్యమును బట్టి చూచినచో నీతని కవితాసామర్థ్యము వెల్లడి కాఁగలదు.

"అవనిసుర భామినియుఁ బోలె నద్దమరేయి
స్వప్నమున వచ్చి కరుణా ప్రసాదమునను
గవిత నాకు నొసంగు శ్రీకంఠ సాధ్వి
భ్రమర వినతింతు వాక్ప్రౌఢిమమును మెఱయ"

అనియు,

"ఏఁ బ్రబంధంబు రచియింప నెదను బూను
నపుడె సాక్షాత్కరించి చిత్తాంబుజమున
భ్రమర నిలిచి సృజించు సద్భాషణముల
నస్మదీయ ప్రసంగమెందైనఁ గలదె"

అనియుఁ ముందుగా వాకొని

"భ్రమరాంబికావర ప్రభవదివ్య కవిత్వ
విద్యాప్రవీణత వెలసినాఁడ
ఘటికాశత గ్రంథ ఘటనాసమంచిత
చాతుర్యమహిమకుఁ జాలినాఁడ
బ్రౌఢిమనేకైక పక్షమాస మహాప్ర
బంధకల్పనశక్తిఁ బ్రబలినాఁడ
మఱియు నానావిచిత్ర మాధుర్యవాక్య ప్ర
గల్భనంబున నుతుల్ గాంచినాఁడ

శ్రీకుధర మల్లికార్జున శ్రీపదాబ్జ
మత్తభృంగాయమాన సన్మానసుండ
సత్కవీశ్వర కరుణాప్రసాద వశుఁడ
గట్టుప్రభు నామధేయ విఖ్యాతయశుఁడ"

అని భ్రమరాంబికావర ప్రసాదలబ్ధ సరసకవితాధురంధర యని వెల్లడించుటలో నీకవి తన గొప్పతనము వ్యక్తపఱచినాఁడు· ఈతఁడు దేవి నుపాసించువాఁ డనియు, గడియకు నూఱేసి పద్యములు చెప్పఁగలవాఁడనియు, ఒక పక్షమునకు, ఒక నెలకు ఒకటి వంతున గొప్ప కావ్యములను రచించు నేర్పుగల వాఁడనియు స్పష్టము.

"ఈతని కవిత్వమంతగా నిర్దుష్టమయినదియు, ప్రౌఢమయినదియుఁ గాక పోయినను, మంచి లోకోక్తులతోను, న్యాయములతోను నిండియుండి ద్రాక్షాపాకమునఁ జదువువారి కింపుగా నుండును" అని శ్రీ కం॥ వీ॥ పంతులుగారు తమ యుద్దేశమును స్పష్టపఱచినారు.

"ఈతని కవిత్వమునం దచ్చటచ్చటఁ గొన్ని దోషములున్నను శైలి మృదువై, పెక్కు సంస్కృత లోకోక్తులును, ఆంధ్రలోకోక్తులును గలిగి చదువరులకు మనోహరంబైయున్నద"ని శ్రీ వావిళ్లవారు పీఠికలో వ్యక్తపఱచిరి.

వీరు దోషములుగా నెంచునది సహజముగా కవిచే చేయఁబడినవా లేక లేఖక ప్రమాద జనితములా యని సంశయము కల్గుటకు మార్గదర్శకులు రామా & కో వారు.

"ఈ గ్రంథమునఁ గొలఁది ఛందోవ్యాకరణాదిలోపములు గన్పట్టుచున్నవి. అవి గ్రంథకర్త లోపములు కావనియుఁ దర్వాతి వారాప్రతిని వ్రాసికొనుటలో దొరలిన నెరసులనియు నమ్ముచున్నారము" అని స్థూలముగా ననినారు. వీరి సిద్ధాంతమును దీసికొని 'ఆంధ్రసాహిత్యపరిషత్తు' వారి చెంత లభ్యములగు సమగ్రా సమగ్ర

ములగు పది తాటాకుల గ్రంథముల సహాయముతోను, ఇతరత్ర లభించు గ్రంథాధారముతోను శుద్ధమగు పాఠములు దొరికినచో వానిని వెల్లడింపఁగోరుటయే నా సంకల్పము. చక్కఁగా పరికించినచో సత్యాసత్యములు వెల్లడి కాఁగలవుగదా ?

ఈకవి శివభక్తుఁడయ్యును, భ్రమరాంబికా వరప్రసాదలబ్ధసరస కవితాధురంధరుఁడయ్యును, శ్రీకృష్ణ చరితమును వర్ణించుటనుబట్టియో, మఱి యే కారణముచేతనో,

"నరులకు నంకితములుగా,
వరకృతులొనరింప నిగుల వాంఛలు లేమిన్,
గరుణారసపూరితుఁడగు,
హరికి సమర్పింతు"

నని పల్కి శ్రీకృష్ణునకే షష్ఠ్యంతములతో సమర్పించుట వింతకాకపోదు.

"శ్రీమద్వ్రజాంగనాచిత్త చిత్రాంబర
చౌర్యచాతుర్య విచక్షణుండు...
మదన గోపాలకృష్ణ రమా మాధవుండు
చెలఁగి జగముల నెల్ల రక్షించుఁగాత"

యని ప్రారంభించుటచేఁగూడ కవికిఁగల హరిభక్తి వెల్లడిఁ యగుచున్నది. శ్రీకృష్ణదేవుని ప్రశంస యెక్కడవచ్చినను శ్రమముగా వర్ణించుటకూడ దీనిని బలపఱచును. తఱచుగా దైవమని పల్కించుచుఁ బరమేశ్వరుఁడని కూడ వామాక్షిచేఁ బల్కించుటలో కవి యేమేని సంకల్ప ముంచుకొనినాఁడేమో అనిపించును. "దైవంబె నీకు శ్రీహరి" "సకల భువనములను సంరక్షణము సేయ

నీశ్వరుండె కర్త యెంచిచూడ"

అని హరిహరాభేదమును వెల్లడించుట కవి సముద్దిష్టమేమో?

సంస్కృత శ్లోకార్థములు, లోకోక్తులు తెలుఁగు సామెతలు నానుడులు వాడి, కవిత్వ మిట్టిదిగానున్న బాగుండునని తోఁపించు పద్ధతిలో నీతని కవిత్వ రచన సాగినది. సంస్కృతాంధ్రములకున్న యత్యంత సన్నిహిత సంబంధమును బురస్కరించుకొని సంస్కృతపదముల నధికముగా నుపయోగించిన కవులు పెక్కురున్నారుగాని ప్రతి నిత్యము ప్రజాసామాన్యము నోట వెల్వడు సంస్కృతోక్తులను సందర్భానుసారముగా వాడినవా రరుదు. ఏ ఒక్క సామెతయు వ్యర్థముగా వాడలేదు. కొన్ని సామెతలకు సవరణ వివరణము లవసరములని భావించువారు లేకపోరు. కాని ఇంత సులభముగా బోధపడు లోకోక్తుల నాతఁడె ట్లొక్కచోట చేర్పఁగలిగినాఁడో యనునది విశేషము. ఉదాహరణములనేకములు ప్రతి పద్యమునను కన్పించును. వ్యాసుని, పోతనను మించిన మన స్తత్వములతో పాత్రలను చిత్రించి ఈ కవి తన ప్రత్యేకతను చాటుట ఈ గ్రంథ వైశిష్ట్యము.

---

# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

శబ్దము స్మృతిని పరామర్శచేయును. అనగా నింతకుఁబూర్వమే బుద్ధియందున్న విషయమునే పరామర్శించును. స్మృతి కింతకుఁ బూర్వ మనుభూతమైన యర్థమే, విషయమగును. అనుభవిష్యమాణమగు నర్థము విషయముకానేఱదు. కావున సర్వనామము ప్రకాన్తార్థమునే పరామర్శించునని సిద్ధాన్తితమైనది.

ప్రశ్న :—స్మృతి పరామర్శకమగు తచ్ఛబ్దమున కనుభూతార్థమే విషయమగుచో అత్యన్త మపరోక్షులగు రామాదులను తచ్ఛబ్దముతోఁ బరామర్శించుట యెట్లు పొసగును ? రామాదులు కవియింద్రియములకుఁ గోచరించువారు కారుగదా !

సమాధానము :—ప్రస్తుతమనుభవమను శబ్దమునకు "ఇంద్రియములకుఁ గోచరమగుట"యను నర్థమును చెప్పఁగూడదు. ప్రతీతిమాత్రమే యనుభవమని చెప్పవలెను.

ఇచట నీవిషయమును గుర్తింపవలెను. ఏది లేకున్నచో దేనికి స్వరూపమే సిద్ధింపదో, దాని కా మొదటి దానియపేక్ష యుండుట న్యాయ్యము. స్మృతియనునది యైన్ద్రియిక ప్రతీతిలేకున్నను ప్రతీతిమాత్రమున్నను సిద్ధించును. ప్రతీతియనునది లేనిదే స్మృతి కలుఁగదు. కావున స్మృతియనునది ప్రతీతి సామాన్యము నపేక్షించును. ప్రతీతియనునది శబ్దమునుండియుఁ గల్గును. రామాదు లింద్రియగోచరులు కారు. కావున వారివిషయమున నైన్ద్రియిక ప్రతీతి యుండనిమాట వాస్తవమే. కాని శబ్దమునుండిగాని ప్రసిద్ధి ననుసరించిగాని ప్రతీతి కలుగుట కభ్యన్తర ముండదు. శబ్దమునుండి ప్రతీతికలుగునని యంగీకరించినపుడు స్మృతి పరామర్శకమగు తచ్ఛబ్దము పూర్వప్రకాన్తమును, పరామర్శించు ననుటలో దోషము లేదు. ప్రస్తుతము గంగయను

వర్థము ప్రతీతపూర్వము గాదు. కావున పరామర్శప్రక్రమ భేదదోష మిచట నున్నదని చెప్పవలసివచ్చినది.

ప్రశ్న:—క్రమభేద దోషమనునది పదార్థములయొక్క పౌర్వాపర్యము నాశ్రయించినది. కావున. పదార్థములను విమర్శించుసమయమునందుమాత్రమే, ప్రారంభమునందే ప్రతీతపూర్వముగాని పదమును ప్రయోగించుట తగదు. అట్లుప్రయోగించినపదము వివక్షితమగు నర్థమును బోధింపలేదు"అని మనమువిమర్శించి యీదోషమును చూపవచ్చును. వాక్యార్థమునందు విభాగము లనునవియే లేవు. వాక్యార్థమఖండమే. అంశములను వందులేవు. అనఁగా పద, పదార్థములు విడిగా వాక్యార్థమునందు భాసింపవు. పద, పదార్థప్రతీతియే లేనపుడు పదార్థములలోని పౌర్వాపర్యమెట్లు భాసించును ? భాసింపనపుడీ దోషమునకు ప్రసక్తి లేదుగదా !

సమాధానము: —సత్యమే. లోకములో శబ్దవ్యవహారమంతకును వక్తయొక్క యభిప్రాయమును శ్రోతలకు దెలియఁజేయుటయే ప్రయోజనము. వాక్యార్థమంతయు శబ్దవ్యవహారరూపమైనదే. కావున వాక్యార్థము వక్త్రభిప్రాయమునకు ప్రతిబింబ రూపమేకాని తదన్యముకాదు. అందువలననే "వక్తురభిప్రాయం సూచయేయుః" (వాక్యములు వక్తయొక్క అభిప్రాయమును సూచించును) అను వాక్యము ప్రసిద్ధినొందినది.— ఈ వాక్యార్థ విమర్శయందు పౌర్వాపర్యప్రక్రమ భేదమను నీ దోషముండనే యుండును. కాని యత్యల్పమగు స్వరూపమును గలిగియుండుటచే, దానిని మనము స్ఫుటముగ గుర్తింపలేము. ఆ దోషమే పదములకు సంబంధించిన జ్ఞానమునందు స్పష్టముగ గోచరించును. పదార్థజ్ఞానము వాక్యార్థజ్ఞానమునకు ముందేయుండును. పదార్థములయందున్న యీ దోషము, తదనన్తరము ప్రతీతమగు వాక్యార్థమునందును భాసించియే తీరవలయును. కావున వాక్యార్థము

నందును, నస్ఫుటముగనైనను, నీ దోషము గుకుననుటలో నసామంజ
స్యము లేదు.

దోషోద్ధరణ ప్రయత్నము:- పై శ్లోకములోని పాదములు
ప్రహూకవిశేమున వ్యత్యస్తములైనవి.

"ప్రతీపగా ముత్తరతోస్య గంగామ్
తీర్థే తదీయే గజసేతు బంధాత్"

అనియే యుండవలయును. అపుడు గంగాశబ్దము మొదటనే
యున్నది. దాని తరువాతనే "తదీయే" అను శబ్దము వచ్చును.
"తదీయ" శబ్దము పూర్వము ప్రస్తావమైన గంగా శబ్దమునే పరామ
ర్శించుటచే దోష ముండదుగదా !

ప్రయత్న నిరాసము:- అట్లు చెప్పుటకు వీలుపడదు. ఒకటి
రెండు పాదములను, తలక్రిందులుచేసి చదివినను, దోషోద్ఘాటనము
జరుగదు. "గజసేతు బంధాత్" అనునది హేతువాచక పదము.
"ప్రతీపగామ్" అనునది కార్యవాచక పదము. హేతు, హేతుమత్పద
ములకు మధ్య, వ్యవధానమున్నచో, వేఁటొక ప్రక్రమభేద దోషము
త్పన్నమగును. ప్రస్తుతము ప్రతీపగామ్ అను హేతుమద్వాచక పద
మునకును గజసేతు బన్ధాత్ అను హేతువాచక పదమునకును మధ్య,
"తీర్థేతదీయే" అను రెండు పదములున్నవి. హేతుత్వము. శబ్దము
చేతనే సాక్షాత్తుగ ప్రతీతమగుచున్నపుడు హేతు, హేతుమత్తులకు
మధ్య వ్యవధానముండరాదు. ప్రస్తుతము, హేతుత్వము, గజసేతు
బంధాత్ పదములోని పంచమీ విభక్తిచే సాక్షాత్తుగఁ దెలుపఁబడు
చుండుటచే, "తీర్థేతదీయే" పదముల వ్యవధానము దోషావహమైనది.
కావున నీ దోషము పోవలయునన్న

"ప్రతీపగా ముత్తరతోస్య గంగామ్
తీర్థేతదీయే గజసేతు బద్ధామ్"- అని మార్చవలయును.

ఈ పాఠము ననుసరించి "గజసేతు బద్ధామ్"- (ఏనుగుల నెడు సేతువుచే బంధింపఁబడిన- అందు వలననే- ప్రతీపగామ్=ఎదురుగా ప్రవహించు, గంగానదిని)అనునది, గంగకు విశేషణమగును-ఆ రెండు పదార్థములకును విశేష్య విశేషణ భావము స్ఫురించిన తరువాత అర్థ బలము వలన, గజసేతు బంధము ప్రతీపగమనమునకు హేతువని తెలియును.- ఇంతకు ముందటి పాఠములో శాబ్దమైన హేతువు ప్రస్తుత మార్థమైనది.- ప్రస్తుతపాఠమునందుఁగూడ- "గంగా" "గజసేతుబద్ధ" పదములకు మధ్య "తీర్థేశదీయే" పదములున్నవి.

అయినను పూర్వసూచితమైన ప్రక్రమభంగ దోషము రాదు. హేతు హేతుమద్భావమార్థమైనపుడు, హేతుత్వము, తద్వాచకమగు పదముయొక్క యర్థము క్షణమునందే భాసించును. అపుడు హేతుమత్తు దగ్గఱ లేకుండుటచే స్ఫుట ప్రతీతికి భంగము కలుగును. అందుచే నపుడిది దోషమైనది. హేతు హేతుమద్భావమార్థమైనపుడు హేతుత్వము మొదటనే స్ఫురింపదు. "గజసేతు బద్ధామ్" అనునది, మొదట గంగకు విశేషణముగ నన్వయించి, విశేష్యమును వర్ణించుటచే చరితార్థమైనది. తరువాత క్షణమునందు, "ఇది హేతువగుటచే నిచట విశేషణ రూపము నన్వయించినది" అను నాలోచనాసామర్థ్యము వలన విశేషణమునందలి హేతుత్వము భాసించును. కావున హేతుత్వ ప్రతీతియందే విలంబమున్నది. అపుడు హేతు హేతుమత్తులకు వ్యవధానము దోషావహము కాదు. అందుచే సూచించిన రీతిని, శ్లోకపాదములకు విపర్యయముచేయుట, శాబ్దమైన హేతువు నార్థముగను చేయుటయే మేలు-

పౌనరుక్త్యము:- శబ్దపౌనరుక్త్యము-అర్థపౌనరుక్త్యమునని, పౌనరుక్త్యమను దోషము రెండు విధములుగ నుండవచ్చును. "శబ్దార్థయోః పునర్వచనమ్ పునరుక్తం, అన్యత్రానువాదాత్" అను లక్ష

పాదమునిరచితమైన సూత్రమునందుఁ గూడ పునరుక్తిదోష మిట్టే రెండు విధములుగ విభజింపఁబడినది.- "ఘటము" "ఘటము" అను రీతి నొకే శబ్దము రెండు పర్యాయము లుపయోగింపఁబడినపుడు శబ్ద పునరుక్తి దోషము కల్గును. "ఘటము"- "కలశము"- ఇవి రెండును భిన్నశబ్దము లే. కాని రెంటికిని 'కుండ' యనియే యర్థము. ఈ విధ ముగ నొకే యర్థమును బోధించు రెండు పర్యాయపదములు ప్రయుక్తములైనపు డర్థపౌనరుక్త్యమను దోషముకల్గును. ఇట్లు, పౌనరుక్త్య దోషము రెండు విధములుగఁ గన్పడుచున్నను, అర్థమునకు సంబంధించిన పునరుక్తిదోషము నొకదానిని మాత్రమే యంగీకరించుట యుక్తము. శబ్దములు పునరుక్తములైనను, నర్థభేదముండెనేని, యచట శబ్దపునరుక్తి దోషముగాదు. వాదన్యాయమునందీ విషయమే యీ క్రింది పంక్తులలో నిరూపితమైనది. "తచ్చ న శబ్దపునరుక్తం పృథక్ వాచ్యమ్ అర్థపునరుక్తేనైవ గతార్థత్వాత్। న హ్యర్థభేదే శబ్దసామ్యేపి కశ్చిద్దోషః" యథా-

"హసతి హసతి స్వామిన్యుచ్చై రుదత్యపి రోదితి
ద్రవిణకణికాక్రీతం యన్త్రం ప్రనృత్యతి నృత్యతి"

అర్థము:- శబ్దపునరుక్తిని ప్రత్యేకముగఁ జెప్పనక్కఱలేదు- అర్థపునరుక్తముతో నది గతార్థమగును. అర్థభేదమున్నచో శబ్దసామ్య మున్నను దోషమేమియు లేదుగదా! ఈ విషయమున కుదాహరణము నీ క్రింది శ్లోకమునఁ జూడవచ్చును.. శ్లోకార్థము-

ద్రవ్యకణికాక్రీతం=ద్రవ్యలేశముచేఁ గొనఁబడిన, యన్త్రమ్= యన్త్రము, (భృత్యుఁడని భావము), స్వామిని=ప్రభువు, ఉచ్చైః= బిగ్గఱగా, హసతి=నవ్వుచుండగా, హసతి=నవ్వును, రోదితి=ఏడ్చుచుండఁగా, రోదితి అపి=ఏడ్చును కూడ, ప్రనృత్యతి=నృత్యము చేయుచుండగా, నృత్యతి=నృత్యము చేయును-

భావము:- ద్రవ్యము నాశించి కొలువుసేయు సేవకుఁడు, తన ప్రభువు నవ్వినపుడు, తానును నవ్వును. అతఁడేడ్చుచో తాను నేడ్చును. అతఁడు నృత్యము సేయుచో తానును నృత్యము సేయును. సేవకునకు వ్యక్తిత్వము లేదు. ప్రభువుయొక్క చిత్తవృత్తిననుసరించును అధికారికి వంతపాటఁ బాడునని భావము. అట్టి భృత్యుని యీ శ్లోక కర్త, ఒక యంత్రముగా భావించి రూపించినాఁడు. ప్రాణము, జ్ఞానము లేని యన్త్రము, యన్త్రిచోదకుని యిచ్ఛ ననుసరించి నడచును. ఈ భృత్యుఁడును నట్టివాడే. యన్త్రమును ద్రవ్యమిచ్చి కొందుము. వేతన మిచ్చి, సేవకుని-ఏర్పాటు చేసికొందుము. ఈ సాదృశ్యముచే యన్త్రమునకును సేవకునకును నిచట నభేద మారోపితమైనది-

వ్యాఖ్య:- పై శ్లోకమున, హసతి, హసతి, ప్రనృత్యతి, నృత్యతి, అను తావులలో, శబ్దములు పునరుక్తములైనట్లు, కన్పడుచున్నవి. కాని యిందులో, మొదటనున్న 'హసతి' యనుశబ్దము "హసత్" అను వర్తమానార్థక శతృప్రత్యయాన్త మగు శబ్దమునకు సప్తమీ విభక్తిఁ జేయగా వచ్చినరూపము. ఇది స్వామిని యనుపదమునకు విశేషణము. రెండవ హసతి యనునది క్రియావాచకపదము. ఇటులే ప్రనృత్యతి, నృత్యతి యను పదముల విషయమునఁ గూడఁ దెలియవలయును. ఇచట పునరుక్తములైనపదములకు అర్థమున భేదమున్నది. అందుచే నిచట పునరుక్తదోషమున్నదని చెప్పఁజనదు. ఈ ప్రమాణము ననుసరించియు, నర్థభేదమున్నచో, శబ్దసామ్య మున్నంతమాత్రమున పునరుక్తదోషము కలుగదని తెలియుచున్నది. ఇట్లర్థభేదము లేనిచో, శబ్దపునరుక్తదోషమే యగును- అర్థభేదమున్నపుడు, తాత్పర్యభేదముండుటవే, నచటి శబ్ద పునరుక్తి దూషణముకాదు సరిగదా, భూషణము కూడ నగును.- అటువంటి పునరుక్తిని లాటానుప్రాసమను శబ్దాలంకారముగ. నాలంకారికు లంగీకరించినారు. ఉదాహరణము :-

శ్లో. "వస్త్రీయన్తే నదీనాం సితకుసుమధరాః, శక్రసంకాశ! కాశాః కాశాభా భాన్తితాసాం నవపులినగతాః శ్రీనదీ హంస హంసాః హంసాంభోఽమ్భోదముక్తస్ఫురదమలవపు ర్మేదినీచంద్ర! చంద్ర శ్చన్ద్రాభః శారదస్తే జయకృదుపగతో విద్విషాంకాలకాల!"

అర్థము : శక్రసంకాశ=ఇంద్రునితో సమానుఁడవగు నోరాజా! సితకుసుమధరాః=తెల్లనిపూవులను ధరించిన, కాశాః=జెల్లులు, నదీనామ్=నదులకు, వస్త్రీయన్తే=వస్త్రములవలె నాచరించుచున్నవి. (వస్త్రములవలె నున్నవని భావము.); శ్రీనదీహంస=లక్ష్మియనెడు నదిలోహంసయైనవాఁడా!, తాసామ్=ఆనదులయొక్క, నవపులినగతాః=క్రొత్తయిసుకతిన్నెలయందున్న, హంసాః=హంసలు, కాశాభాః=జెల్లులను పోలి; భాన్తి=ప్రకాశించుచున్నది, మేదినీచన్ద్ర=భూమియందలి చంద్రుఁడా!, అమ్భోదముక్తస్ఫురదమలవపుః=మేఘములచేవిడువబడి ప్రకాశించుచున్న స్వచ్ఛమగు శరీరముగల, చన్ద్రః=చన్ద్రుఁడు, హంసాభః=హంసవలె నున్నాఁడు. విద్విషాంకాలః=శత్రువులకు యముఁడవైన ఓరాజా!, చన్ద్రాభః=చన్ద్రుని పోలినట్టియు, తే=నీకు. జయకృత్=జయమును కలుగఁజేయునట్టియు, శారదఃకాలః=శరత్కాలము, ఉపగతః వచ్చినది.

వ్యాఖ్య— పైపద్యమున శక్రసంకాశ, శ్రీనదీహంస, మేదినీచంద్ర, విద్విషాంకాల—అను నాలుగుపదములును సంబోధ్య వాచకములు. కాశాః, హంసాః, చన్ద్రః, కాలః—అను నీనాలుగు పదములును ఉపమేయవాచకములు. కాశాభః, హంసాభః, చన్ద్రాభః అను చోట, కాశ, హంస, చన్ద్ర పదములు సమానవాచకములు.'కాశాః వస్త్రీయన్తే' యనునపుడు-కాశపద ముపమేయవాచకము. వస్త్రములుపమానములు—హంసాః కాశాభాః అనునపుడు—కాశపద ముపమానవాచక మైనది. ఇటులే పై వాక్యములయందును నూహింపనగును.

ఇచట కాశ, హంస, చన్ద్రిములు ఒక్కొక్కటి మూఁడు పర్యాయము లావృత్తము లైనవి. అందుచే శబ్దపునరుక్తి యున్నటులు కనుపించును. కాని యాశబ్దములన్నియు నొకే విధమగు నర్థమును తెలుపుట లేదు. ఆయర్థములొకచో నుపమానముగను, వేఱొకచో నుపమేయముగను నున్నవి. అందుచేఁ దాత్పర్యభేదమున్నది. అందుచే నిట్టితావులందు శబ్దపునరుక్తి యను దోషమున్నదని నిర్ణయింపరాదు. అర్థభేదముగాని తాత్పర్యభేదముగాని, లేనిచో శబ్దపౌనరుక్త్యము దోషమేయగును.

ఉదాహరణము :

"జక్షుర్బిసాన్ ధృతవికాసి బిసప్రసూనాః"

అర్థము:- ధృతవికాసి బిసప్రసూనాః=ధరింపఁబడిన వికసించిన తామరపుష్పములు గలవారై, బిసాన్=తామర తూండ్లను, జక్షుః= తినిరి.

ఇచట, 'బిస'యను పదము రెండు పర్యాయములు ప్రయుక్తమైనది. రెండు చోట్లను 'తామర' యనియే యర్థము. అర్థభేదము లేదు. అందుచే నిచట శబ్ద పౌనరుక్త్యదోషమున్నది. 'బిసప్రసూనాః' అను సమాసమునందు బిస శబ్దమునకు బదులు, సర్వనామమును ప్రయోగించి, మొదట బిసశబ్దమును పరామర్శించినచో బాగుండెడిది.

ప్రశ్న:- మొదటి బిస శబ్దము తినుట యను క్రియకు కర్మగా నుపయుక్తమైనది. రెండవ బిస శబ్దము పుష్పసంబంధము కలదిగా నుపయుక్తమైనది. ఈ విధముగ నిచటఁగూడ రెండు బిసశబ్దములకును తాత్పర్యభేద మున్నదిగదా ?

సమాధానము:- స్వార్థమును కేవలము చెప్పుట తాత్పర్యము గానేరదు. తన యర్థమును చెప్పుచునే, అంతకంటె నధికమగు నర్థమును చెప్పుట కున్ముఖమగుట తాత్పర్య మని యందుము.

పూర్వము 'శాశ' శబ్దములు, రెల్లు జాతికి సంబంధించిన పదార్థమును మాత్రమే తెలుపలేవు. అంతకంటె నతిరిక్తమైన యుపమానోపమేయ భావములను గూడ ప్రతిపాదించినవి. ఆ విధముగా నిచట నీవ శబ్దములు, తామరతూడను నర్థముకంటె నతిరిక్తమగు నర్థము నేమియుఁ దెలుపుటలేవు. ఇచటఁగూడ కర్మత్వము సంబంధిత్వము నను నర్థములు వాచ్యార్థముకంటె నతిరిక్తములున్నవి గదా యని యడుగవచ్చును. కాని కర్మత్వ సంబంధిత్వములు, వాచ్యార్థము లే. ప్రతిశబ్దముయొక్క అర్థమును, వేఱొకశబ్దముయొక్క యర్థమునకు కర్మగానో సంబంధిగానో యన్వయించియే తీరును. లేనిచో వాక్యమున పదముల కన్వయమే కుదురదు. అందుచే కర్మత్వసంబంధిత్వాదులు తాత్పర్యము లనఁ జెల్లవు. వాచ్యార్థములే యగును. ఈవిషయమునే యీ సంగ్రహశ్లోకములు చెప్పును.

"సర్వనామ పరామర్శయోగ్య స్యార్థస్య యత్పునః
స్వశబ్దేనాభిధానం సా శబ్దస్య పునరుక్తతా"

తా. సర్వనామముతో పరామర్శించుటకు యోగ్యమైన యర్థమును, స్వశబ్దముతోనే తిరిగి తెల్పుట శబ్దపునరుక్తి దోషమగును. ఇచట నీవిషయమును గుర్తింపవలయును. పూర్వము, అర్థపౌనరుక్త్యముచే శబ్దపౌనరుక్త్యము, గతార్థమగుటచే, శబ్దపౌనరుక్త్యమనునది యర్థాశ్రయమే యగుటచే, నది యొకటియే యనియు గ్రంథకర్త యనినాఁడు. ఇపుడు, శబ్దపునరుక్తియను దోషము నంగీకరించి, దానికి లక్షణమును నిర్వచించినాఁడు. ఇది పూర్వవిరుద్ధము గాదా యని యాశంక కలుగును. సత్యమే.సమాధాన మిది.అర్థప్రతీతి కొఱకయియే శబ్దమును ప్రయోగించుచున్నాము. అందుచే శబ్దార్థములలో నర్థము ప్రధానమైనది. అర్థపునరుక్తియున్నప్పుడే, శబ్దపునరుక్తి దోషమగును. తదితరస్థలమున, నర్థభేదమున్నపుడు శబ్దపునరుక్తిదోషము కాదని

యింతకుఁ బూర్వమే తెల్పియున్నాము. కావున నర్థ పౌనరుక్త్య మున్నపుడే శబ్దపౌనరుక్త్యము సంభవించును. అనఁగా శబ్దపునరుక్తియు నర్థము నాశ్రయించియే నిర్ణీతమగుచున్నది. అందుచే నర్థపునరుక్తి నంగీకరించినచో, శబ్దపునరుక్తియుఁ, సిద్ధించినట్లే యను నభిప్రాయముతో, పౌనరుక్త్యమనునది యొకటియే యని గ్రంథకర్త చెప్పినాఁడు. శబ్దపునరుక్తి యనునది లేనేలేదని తాత్పర్యముగాదు. ఉన్నను నది యర్థపౌనరుక్త్యముచే గతార్థమగుననియు, నందుచే ప్రత్యేకముగ దాని నెన్ని చూపింపనక్కఱలేదనియు గ్రంథకర్తయొక్క భావమని తెలియవలెను.

పరామర్శయోగ్యత :- ప్రసంగవశమున పరామర్శయోగ్యత యను విషయమును గుఱించి పరిశీలన ప్రారంభమగుచున్నది.

శ్లో. ప్రాధాన్య మథ సంబంధ నిబన్ధో యోగ్యతా ద్వయీ
నాత స్సమాసగస్యాపి పరామర్శోస్య దుష్యతి.

పరామర్శయోగ్యత యనునది రెండు విధములు, (1) శాబ్దము దీనిని ప్రధానయోగ్యత యని యందురు. (2) అర్థము, దీనిని సంబంధ నిబన్ధనమని యందురు.

పరామృశ్యమగు నర్థమును తెల్పు శబ్దము కర్తయో కర్మయో యై స్వతంత్రముగ భాసించుచున్నచో, నపుడు ప్రధానమగుయోగ్యత లేక శాబ్దియగు యోగ్యతయున్నదని చెప్పుదుము. పరామృశ్య శబ్దము ప్రధానమైనదగుచో, పరామృశ్యమగు నర్థము సాక్షాత్తుగ భాసించును. దీని కుదాహరణము.

"చారుతావపు రభూషయ దాసాం తా మనూనసవయౌవన యోగః
తం పునర్మకరకేతనలక్ష్మీః తామ్మద స్తమపి వల్లభసంగః"

ఈపద్యమునందు "చారుతా" యను పదార్థమును "తామ్" అను సర్వనామము పరామర్శించినది. ఇచట చారుతా యనునది కర్తగ

నుండుటచే, దానిని పరామర్శించుటకు తచ్ఛబ్దమునకుఁగల యోగ్యత శాబ్దియోగ్యత యైనది.

ఇట్లుకాక పరామర్శింపవలసిన యర్థమునకు సంబంధించిన వేఱొకపదార్థమును నిర్దేశించుటవలన పరామర్శయోగ్యత యెచట లభించునో అచట 'ఆర్థి యోగ్యత' యున్నదందుము. అచట సంబంధి పదార్థబలమువలననే పరామర్శ జరుగుచుండుటచే దానిని సంబంధి నిబన్ధయోగ్యత, యనినారు. శాబ్దియోగ్యతయందువలె సాక్షాత్తుగ పరామృశ్యార్థము భాసింపకుండుటచేతను, సంబంధి వాచకముయొక్క యర్థమువలననే పరామృశార్థము భాసించుటచేతను దీనిని ఆర్థియోగ్యత యనినారు.

ఉదా:-"భాతిసితభూతిలిప్తః శశాంకమౌళిః తదంశునిచిత ఇవ.

అర్థము :-సితభూతిలిప్తః-తెల్లని భస్మమును ధరించిన, శశాంకమౌళిః-చంద్రుఁడే శిరోభూషణముగాగల శివుఁడు,తదంశు నిచిత ఇవ ఆచంద్రునియొక్క కిరణములచేవ్యాప్తుఁడైనవానివలెకన్పడుచున్నాడు ఇచట 'తదంశునిచితః" అను సమాసములో "తత్" శబ్దము, "శశాంకమౌళి"యను సమాసములో నేకదేశమైన శశాంక శబ్దమును పరామర్శించుచున్నది. శశాంకమౌళిని (ఈశ్వరుని) పరామర్శించుట లేదు. ఇట్లు సమాసమున నున్న శబ్దమును పరామర్శింపవచ్చునా ?- సంబంధివాచకపదమున్నప్పుడు పరామర్శింపవచ్చును. ప్రస్తుతము అంశు శబ్దమునకు కిరణములని యర్థము. ఎవరి కిరణములు ? అని ప్రశ్న వచ్చినతోడనే కిరణములకు సంబంధించిన శశాంకుడే స్ఫురించును. ఇట్లు ఆ శశాంకపదము పూర్వశ్లోకమునందు "చారుత" వలె స్వతన్త్రమైనదిగాదు. "శశాంకమౌళి" యను పదమున గుణీభూతమైనది. "శశాంకమౌళి" పదముయొక్క యర్థము భాసించినపుడా యర్థములో నప్రధానముగ శశాంకపదార్థము గూడ స్ఫురించును. అందుచే

నిట, పరామర్శనీయమగు నర్థము "అప్రధానమైనది." "తదంశవః" అను పదమున "అంశు" శబ్దార్థము, శశాంకపదార్థమునకు సంబంధించినది. అనఁగా అంశు పదము "సంబంధి" యైనది. పరామర్శనీయమగు నర్థమునకు "సంబంధి"యైన "అంశు" పదముండుటచేతనే, యీ "యంశు" పదమునకు విశేషణముగనున్న "తత్" అను సర్వనామము, "శశాంక" పదమును పరామర్శించుచున్నది. కావున నిట్టి పరామర్శను సంబంధి నిబంధన మనినాము.

ఇచట నీ విషయమును గుర్తింపవలయును.- సమాసమునందు గుణీభూతముగనున్న పదము సమాసమునలేని పదముతో స్వతంత్రముగ నన్వయింపదు. ఆ పదమును సర్వనామముతో పరామర్శించుటయును తగదు. కాని, పరామర్శించు సర్వనామము, పరామర్శనీయమును, సమాస గుణీభూతమును నగు నర్థమునకు సంబంధించిన, శబ్దార్థమునకు, గుణీభూతమైనచో, నపుడా సర్వనామము, సమాసగతమైన శబ్దమునైనను పరామర్శింపవచ్చును. ఈ విషయమునకు మఱియొక యుదాహరణము.

శ్లో॥ జయతి నిశాపతిమౌలి ర్దధన్మహాకాలవిభ్రమ మజస్రమ్
తత్తమసామివ లక్ష్మ్యా కంఠవిషచ్ఛాయయా చ్ఛురితః"

అర్థము:- కంఠవిషచ్ఛాయయా=కంఠమునందలి విషముయొక్క ఛాయచే, నిశాపతిమౌళిః= రాత్రికి భర్తయైన చంద్రుఁడు శిరసునందుఁగల శివుఁడు, తత్తమసామ్=ఆమెయొక్క చీకట్లయొక్క, లక్ష్మ్యా ఇవ=ఛాయచేతనువలె, ఛురితః=కూడినవాఁడై, అజస్రమ్=ఎల్లప్పుడు, మహాకాల విభ్రమమ్,=మహాకాలునియొక్క విభ్రమమును దధత్=కలిగినవాఁడై, జయతి=జయించుచున్నాఁడు. (మహాకాలుఁడు ఈశ్వరుని నామములలో నొకటి. 'ఎక్కువ నలుపుగల' యను నర్థమును వచ్చును. కాల శబ్దమునకు నలుపనియు నర్థము గలదు.)

వ్యాఖ్య. 'నిశాపతిమౌళి':- అనునపుడు, 'నిశా' శబ్దము, నిశాపతి మౌళి సమాసమున విశేషణముగ నుండుటచే నప్రధానమైనది. తత్తమసాః=ఆమెచీకట్లయొక్క, యనుసమాసమున, తమశ్శబ్దము, నిశా సంబంధి. ఈతమశ్శబ్దమునకు విశేషణమైన, 'తత్' శబ్దము, నిశా శబ్దమును పరామర్శించుచున్నది - నిశాసంబంధియగు తమశ్శబ్దమును ప్రయోగించుటయే, తత్ అను సర్వనామశబ్దము సమాసగతమైన నిశాశబ్దమునకును కొంతభేదమున్నది. 'నిశాపతి' (చంద్రుఁడు), నిశాపతిమౌళికి=(ఈశ్వరునకు) గుణీభూతుఁడు. గుణీభూతమైన నిశాపతికి గుణీభూతము నిశ. శశాంకుఁడు, శశాంకమౌళికి మాత్రమే గుణీభూతుఁడు. నిశవలె గుణీభూతములో గుణీభూతుఁడు కాఁడు.

పరామర్శనీయ పదార్థమునకు సంబంధించిన పదముయొక్క ప్రయోగము లేనినాఁడు, పరామర్శించు సర్వనామశబ్దముగూడ స్వతంత్రముగనే యుండవలయును. సమాసమునం దుండఁగూడదు.

"జయతి జగత్త్రయజనకో నగేంద్రసుతయా నిరుద్ధ దేహార్ధః,
సా చ భువనైకజననీ యయా వినా సోపి హి విహస్తః"

అర్థము: నగేంద్రసుతయా=పార్వతిచే, నిరుద్ధ దేహార్ధః=ఆక్రమింపఁబడిన యర్ధశరీరముగల, జగత్త్రయ జనకః=ఈశ్వరుఁడు, జయతి=జయించుచున్నాఁడు. సా చ=ఆమెయు, భువనైకజననీ=ప్రపంచమంతటికిని తల్లి, యయా వినా=ఎవతె లేకుండుటచే, సోపి=ఆయీశ్వరుఁడు గూడ విహస్తః=అసమర్థుడగునో:-

వివరణము:- ఇచట "నగేంద్రసుత"కు సంబంధించిన పదార్థము వేఱొకటి రేఁడియును ప్రయుక్తము కాలేదు. సా అను సర్వనామము నగేంద్రసుతనే పరామర్శించును. ఈసర్వనామము సమాసమునందు లేదు. స్వతంత్రముగనే యున్నది. — కావున సా యను సర్వనామము నగేంద్రసుతాశబ్దమును పరామర్శింపవచ్చును. ఇచటనే

"నగేంద్రతనయానిరుద్ధ దేహార్ధః" అను సమాసమున్నచో, అపుడు, నగేంద్రతనయా సంబంధి వాచకపదము లేకుండుటచే, విడిగ, ప్రధానముగ నున్న "సా" యను సర్వనామము సమాసముననున్న నగేంద్రతనయా శబ్దమును పరామర్శింపలేదు - పరామర్శించుటకు యోగ్యత లేదు.

ఈ యోగ్యతా యోగ్యతలకు సంబంధించిన భేదము నంద అను గుర్తింపలేరు. కావున ప్రాధాన్య మనునదియే యోగ్యతకు ముఖ్యమైనలక్షణము. అదిలేనపుడు, పరామర్శనీయ సంబంధి నిబాధమను యోగ్యత వచ్చును. ఈ రెండు విధములగు యోగ్యతలను నంగీకరింపనిచో, పరామర్శనీయ పదార్థము యొక్క ప్రతీతియే కలుగదు. కావున నీయోగ్యతల నంగీకరింపవలయును.

ప్రస్తుతము "జక్షుర్బిసాన్ బిసవికాసి బిసప్రసూనాః" అనునపుడు, బిసమునకు సంబంధిచిన ప్రసూన శబ్దమున్నది. అపుడు ప్రసూనశబ్దమునకు విశేషణముగా సర్వనామశబ్దము ప్రయోగించియుండుచో, నది, మొదటి బిసశబ్దమును పరామర్శించుటకు యోగ్యమై యుండెడిది. అట్లు ప్రయోగింపక, తిరిగి బిస శబ్దమునే ప్రయోగించుటవలన పునరుక్తిదోషము వచ్చినది. అందుచే "జక్షుర్బిసం వికచమస్య దధుః ప్రసూనమ్" అని పాదమును సవరించుట యుక్తము. ఇట్లు సవరించుచో "అర్థాపక్రమ దోషము" కూడ పరిహృతమగును.

పౌనరుక్త్యమను దోష మనేకప్రకారముల నున్నను - ముఖ్యముగ నది నైదు విధములు.

1. ప్రకృతి పౌనరుక్త్యము, 2. ప్రత్యయ పౌనరుక్త్యము
3. ఉభయ పౌనరుక్త్యము 4. పదపౌనరుక్త్యము, 5. వాక్య పౌనరుక్త్యము:

ప్రకృతిపౌనరుక్త్యమున కుదాహరణము :

"ఆశ్వీయసంహతిభి రుద్ధత ముద్ధురాభిః
భూరేణుజాలమఖిలం వియ దాతతాన"

అర్థము : ఉద్ధురాభిః=అధికమైన, ఆశ్వీయ సంహతిభిః=అశ్వ సమూహ సమూహములచేత, ఉద్ధతమ్ పైకి లేవఁగొట్టఁబడిన అఖిలమ్, భూరేణుజాలమ్=దుమ్మంతయు, వియత్=ఆకాశమును, ఆతతాన=వ్యాపించెను.

వివరణము :- "అశ్వానాం సమూహః" అశ్వములయొక్క సమూహ మనునర్థమున, అశ్వపదమునకు సమూహార్థమున "ఛ" (ఈయ) ప్రత్యయమును చేర్పఁగా, ఆశ్వీయమను రూపము సిద్ధించినది. ఇచట ఆశ్వీయ పదమునందలి ఛ ప్రత్యయము, సంహతిశబ్దము, రెండును సమూహమునే బోధించును. ఈ రెండును "ఆశ్వీయ సంహతిభిః" అను సమాసమున తుదినున్న "భిస్" ప్రత్యయమునకు ప్రకృతులే. ఒకేయర్థమున రెండు ప్రకృతు లుపయోగింపఁబడినవి. ప్రకృతి పౌనరుక్త్యమను దోషము సంభవించినది. "అశ్వైః" అనియే యుండ వలయును.

ప్రత్యయ పునరుక్తి కుదాహరణము :- "బిస కిసలయచ్ఛేద పాథేయవన్తః - తామర చిగురుటాకుల ముక్కలే పాథేయముగా గలవియై" - యని యర్థము. "బిసకిసలయచ్ఛేదా ఏవ పాథేయాః" అని బహువ్రీహిని చెప్పినను సరిపోయెడిదే. ఆ బహువ్రీహి సమాసమే మతుబర్థమును ('కలిగిన' యనునర్థమును) తెలిపెడిదే. ఆ బహువ్రీహి సమాసరూపము తరువాత, 'వన్తః' అని మతుప్ ప్రత్యయమును 'కలిగిన' యను నర్థము చెప్పుటకే తిరిగి ప్రయోగించుట వలన నిచట ప్రత్యయ పునరుక్తి వచ్చినది.

వేఱొక యుదాహరణము :

"త్వగుత్తరా సంగవతీ మధీతినీమ్" ="చర్మమే యుత్తరీయ

ముగా గలదియై' యనియర్థము. ఇచటగూడ "త్వగుత్తరా సంగామ్" అని బహువ్రీహిని చేసిన చాలును. దానిపై తిరిగి మతుప్ ప్రత్యయమును చేర్పనక్కఱలేదు. పైవాక్యములలో, 'ఛేద ఏవ పాథేయమ్' "త్వగేవ ఉత్తరాసంగః" అనునపుడు కర్మధారయసమాసము లున్నవి. వానిపై 'మతుప్' ప్రత్యయములను, రెంటిని, చేయుటకంటె, బహువ్రీహిని చేయుటవలన లాఘవము సిద్ధించును. అందుచే నిచట మత్వర్థప్రత్యయ ప్రయోగము దోషము. "కర్మధారయ మత్వర్థీయాభ్యాం బహువ్రీహిర్లఘుత్వాత్ ప్రక్రియస్య" - అను వాక్య మీయర్థమునే తెల్పును. ఒక బహువ్రీహి సమాసమే, కర్మధారయ, మతుప్ప్రత్యయార్థములను రెంటిని చెప్పుచుండగా మతుప్ప్రత్యయ ప్రయోగము గౌరవాపాదకమగుటచే దోషావహమైనది.(న కర్మధారయాన్మత్వర్థీయ బహువ్రీహిశ్చేత్ తదర్థప్రతిపత్తికరః అను వాక్యమును ఈ విషయమునే తెలుపును.)

ఇచట నీ విషయమును గుర్తింపవలయును. పై ప్రయోగములలో, 'కలిగియుండు' అను నర్థమును తెలుపు, మతుప్ ప్రత్యయము, బహువ్రీహి సమాసము రెండును లేవు. ఉన్నది కర్మధారయ సమాసము మతుప్ ప్రత్యయము మాత్రమే. కాని, కర్మధారయ సమాసముయొక్క శబ్దానుపూర్వియు బహువ్రీహియొక్క శబ్దానుపూర్వియు "త్వగుత్తరాసంగ" యని యొక విధముగనే యుండును. అందుచే నీ రూపమునే బహువ్రీహిగ గ్రహింపవచ్చును. అట్టి సమాసము తరువాత మతుప్ ప్రత్యయ ప్రయోగము దోషము. వాస్తవముగ, బిస, బిస, శబ్దములవలె నిచట శబ్దపునరుక్తి లేదు. కాని యిట్టి దోషములను గూడ పునరుక్తిలో చేర్పవలెనని గ్రంథకర్త యాశయము.

ప్రశ్న:- మతుప్ ప్రత్యయమునకు, బాహుళ్యము, నింద, ప్రశంస, నిత్యయోగము, అతిశయము సంబంధము, ఉండుట, అను

ననేకార్థములున్నవి. ఇవి యన్నియు "అస్త్యర్థమునకు" (ఉండుట యను నర్థమునకు అనుయాయులుగదా! ఈ యర్థములను గూడ బహువ్రీహి సమాసము ప్రతిపాదించునా ?

సమాధానము:- మత్వర్థీయ ప్రత్యయములకన్ని యర్థములును నున్న మాట సత్యమే. అవి యన్నియు 'అస్తి' (ఉండును) అను నర్థము ననుసరించియే యుండును. కాని యవి ప్రకరణాదులవలననే గమ్యములగును. కేవల మత్వర్థీయ ప్రత్యయమున కవి యన్నియును వాచ్యార్థములుగావు. అందుచేతనే యా యర్థముల విషయమున మేము దృష్టాన్తము నిచ్చుటలేదు. ఆ యర్థముల నన్నిటిని బహువ్రీహియు స్వతంత్రముగ ప్రతిపాదింపదని భావము.

వేఱొక యుదాహరణము.

"వాసో జాంబవ పల్లవాని

జఘనే గుంజాస్రజో భూషణమ్'

తా:- నేరేడు చిగురుటాకులే, వస్త్రము, కటియందు గురివెంద గింజలహారములే అలంకారములు. ఇచట 'జాంబవ పల్లవాని' శబ్దములో, జాంబవ పదమునకు జంబూవృక్షమునకు సంబంధించిన యని యర్థము. సంబంధార్థమున తద్ధితప్రత్యయము వచ్చి "జాంబవ" రూపము సిద్ధించినది. కాని "జాంబవ" అనుటకు బదులు, కేవల షష్ఠీ సమాసము నుపయోగించినను చాలును:- అపుడు 'జంబూ ఫలాని' అని యుండును. షష్ఠీసమాసము వలననే సంబంధార్థము భాసించు చుండఁగా, తిరిగి తద్ధిత ప్రత్యయమును, చేర్చి, "జాంబవ" శబ్దము నుపయోగించుట దోషము. ఇటులే 'తదీయ మాతంగఘటా విఘట్టితైః' ఆతనికి సంబంధించిన ఏనుగుల సమూహముచే బ్రద్దలుచేయఁబడిన. 'ఇచటఁ గూడ తన్మాతంగ ఘటా విఘట్టితైః' అని షష్ఠీసమాసముఁ జేసినఁ జాలును.- "యేనాఽకుంభ నిమగ్న వన్యకరిణాం యూథైః, పయః పీయతే."

'కుంభస్థలముల వఱకును మునిగియున్న అడవి యేనుఁగుల సమూహములు పాలు త్రాగుచున్నవి.'- ఇచటఁగూడ, 'వనకరిణామ్' అను షష్ఠీసమాసము కుదురును. అందుచే "వన్య" యను, తద్ధిత ప్రత్యయము నుపయోగించుట దోషము. ఈ తద్ధిత ప్రత్యయమువలన లభించు నర్థమును షష్ఠీసమాసమే తెల్పును.

పైని చూపిన యర్థముకంటె భిన్నమైన యర్థములలో తద్ధిత ప్రత్యయ ముపయోగింపఁబడినచో, నా యర్థములను షష్ఠీ సమాసాదులు తెలుపవుగాన, నచట తద్ధిత ప్రత్యయ ప్రయోగము పునరుక్త దోషమును కలుగఁజేయదు.

ఉదాహరణము:- అథ భూతాని వార్త్రఘ్నశరేభ్య స్తత్రసుః" అర్థము:- భూతాని=భూతములు, వార్త్రఘ్నశరేభ్యః=ఇంద్రుని కుమారునియొక్క బాణములనుండి, తత్రసుః=భయపడినవి.

వివరణము:- వృత్రఘ్నుఁడు=ఇంద్రుఁడు, అతని కుమారుఁడు-వార్త్రఘ్నుఁడు. ఇచట వృత్రఘ్న శబ్దముకంటె. అపత్యార్థమున అణ్ అను తద్ధిత ప్రత్యయమురాఁగా, వార్త్రఘ్న రూపము వచ్చినది-ఈ తద్ధిత ప్రత్యయము "అతనికి సంబంధించిన" మొదలగు నర్థములలో వచ్చినదిగాదు. అందుచే నిచట పునరుక్తి దోషము లేదు.

ఉభయ పౌనరుక్త్యమున కుదాహరణము.

"ఛాయా మపాస్య మహతీమపి వర్తమానామ్
ఆగామినీం జగృహిరే జనతా స్తరూణామ్

అర్థము:- జనతాః=జనసమూహములు, మహతీమపి=పెద్దదైనను, వర్తమానామ్=అపుడున్న, తరూణామ్ ఛాయామ్, అపాస్య=చెట్ల ఛాయను వదలివేసి, ఆగామినీమ్ ఛాయామ్=రానున్న ఛాయను జగృహిరే=గ్రహించిరి.

జనశబ్దమొకటియే మనుష్య సమూహమును తెల్పుటకు చాలును. ఆ శబ్దమునకు, సమూహమును తెలుపు. "తల్" (తా) ప్రత్యయము చేరినది-దీనికి తిరిగి బహువచన ప్రత్యయము చేరినది.- జనతా యను ప్రకృతి. బహువచన ప్రత్యయము-ఈ రెండును మనుష్య బహుత్వమును తెల్పును. ఈ రెంటి యర్థమును జనశబ్ద మొకటియే తెలుపఁగలదు కావున నిచట బహువచనమునకు ప్రకృతియైన సమూహార్థవాచక "తల్"అనునది, బహువచన ప్రత్యయము- రెండును పునరుక్తములు.

పదపౌనరుక్త్యమున కుదాహృతి:-

దలత్కన్దలభాక్ భూమిః, సలమ్బాంబుద మంబరమ్

వాప్యః ఫుల్లాంబుజయుజః జాతా దృష్టేః విషం మమ.

అర్థము:- దలత్కన్దలభాక్=పైకి వచ్చుచున్న మొనలుగల భూమి, సలంబాంబుదమ్=పెద్ద మేఘములుగల అంబరమ్=ఆకాశము, ఫుల్లాంబుజయుజః=వికసించిన పద్మములుగల, వాప్యః=బావులు, మమ, దృష్టేః=నాయొక్క చూపునకు, విషం, జాతాః=విషమైనవి.

వివరణము:- ఇచట, దలత్కన్దలాః, లంబాంబుదమ్ ఫుల్లాంబుజాః- అని బహువ్రీహి సమాసములున్నను "కలవి" యను నర్థము వచ్చెడివియే-అందుచే 'కలవి' యనునర్థమును తెలుపుటకు, మొదటి సమాసములో భాక్, సలంబాంబుజ మనునపుడు 'సహ'+(స), మూఁడవ సమాసమున "యుజః" అను పదముల నుపయోగించుట పునరుక్తము.

విశేష్య పౌనరుక్త్యము విశేషణ ప్రయోగమువలననే విశేష్యము స్ఫురించుచో నచట విశేష్యవాచక పదమును ప్రయోగించుట విశేష్య పౌనరుక్త్యమగును.

ఉదాహరణము:- "పాయాత్స శీతకిరణాభరణో, భవో,నః" శీతకిరణుఁడే (చంద్రుఁడే) యాభరణముగాఁగల. భవుఁడు (శివుఁడు) మిమ్ము రక్షించుగాక యని అర్థము.

ఇచట, శీతకిరణాభరణుఁడనుట వలననే. విశేష్యమైన శివుఁడు స్ఫురించుచుండఁగా, భవపదమును ప్రయోగించుట పునరుక్తమగును.

మఱియొక యుదాహరణము-

"..........సితాంగ సంగినా
చకాసతం చారు చమూరు చర్మణా
కుథేన నాగేన్ద్ర మివేన్ద్ర వాహనమ్"

సందర్భము-మృగచర్మము వీపున వ్రేలాడుచున్న నారద మహర్షి వర్ణనము.

అర్థము:- సితాంగసంగినా=తెల్లని శరీరమును స్పృశించు చున్న, చారు చమూరు చర్మణా=అందమైన మృగచర్మముతో, కుథేన=వర్ణకంబళముతో (ఏనుఁగుపై వేయు కంబళము) ఇంద్రవాహనమ్=ఇంద్రునకు వాహనమైన, నాగేన్ద్ర మివ=ఐరావతమను నేనుఁగు వలె, చకాసతమ్=ప్రకాశించుచున్నట్టి

వివరణము-ఇచట, కుథశబ్దముతోఁ గూడిన ఇంద్రవాహన శబ్దము, ఐరావతమను నేనుఁగునే స్ఫురింపఁజేయును. లేక నాగేంద్ర శబ్దము నొకదానినే ప్రయోగించినను, 'సితాంగసంగినా'యను సమాసములోని 'సిత' (తెల్లని) పదముయొక్క బలము వలన, తెల్లని ఏనుఁగు-అనఁగా ఇంద్రునకు వాహనమను నర్థమును స్ఫురించుచునేయున్నది. ఇట్లేదేనొక పదమును ప్రయోగించుటవలననే, రెండవ పదముయొక్క యర్థము స్ఫురించుచుండఁగా, 'నాగేన్ద్రమ్'- "ఇంద్రవాహనమ్" అను రెండు పదములను ప్రయోగించుట అనావశ్యకము అందుచే పునరుక్తి వచ్చినది.

సాధారణ విశేషణముయొక్క మహిమ వలన విశేష్యము స్ఫురించుచున్నను, ఆ విశేషణము వలన విశేష్యమునందలి విశేష మేదియైనను భాసించుచో నపుడు పునరుక్తిదోషమును సూచించుట తగదు. ఉదాహరణము.

"తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి
సహాయమేకం మధుమేవ లబ్ధ్వా
కుర్యామ్ హరస్యాపి పినాకపాణేః
ధైర్యచ్యుతిం కేమమ ధన్వినోఽన్యే"

అర్థము:- తవ=నీయొక్క (ఇంద్రునియొక్క) ప్రసాదాత్ = అనుగ్రహమువలన, కుసుమాయుధోఽపి=పుష్పములే బాణములుగా గలవాఁడనైనను, మధుమ్ ఏకమేవ=ఒక్క వసంతుని మాత్రమే, సహాయమ్, లబ్ధ్వా=సహాయునిగాఁ బొంది. పినాకపాణేః=పినాకమను ధనువు చేతియందుఁగల, హరస్యాపి=ఈశ్వరునకైనను(జగత్సంహారము చేయువానికైనను) ధైర్యచ్యుతిమ్=ధైర్యము నాశనమును, కుర్యామ్=చేయుదును-మమ=నాకు, అన్యే ధన్వినః, కే=ఇతర ధనుర్ధరులెవ రెదురుగ నుండఁగలరు ?

వివరణము:- ఇచట పినాకపాణి శబ్దము హరశబ్దమునకు విశేషణము. కేవలము పినాకపాణి శబ్దమును ప్రయోగించినను హరశబ్దము ప్రతీతమగును. అందుచే నిచట పినాకపాణి శబ్దము పూర్వోదాహరణము నందువలె వ్యర్థమని చెప్పవచ్చును. కాని యిటనొక విశేషము న్నది. పినాకపాణి శబ్దము కేవలము హరుని తెల్పి యూరకుండదు. పినాకమను ధనువు గలిగియుండుటయను భావము ఈశ్వరుని గొప్పఁదనమును తెల్పును. ఇట్లు విశేష్యగతమగు నొక విశేషమును తెలుపుచుండుటచే, పినాకపాణి శబ్దప్రయోగము వలన నిచట పునరుక్తిదోషము కలుగదని తెలియవలును.

ప్రశ్న:- పినాకపాణి శబ్దమువలెనే, కుసుమాయుధ శబ్దము గూడ, తనకు విశేష్యమైన మన్మథుని యందున్న యల్పత్వమును విశేషమును సూచించుచునేయున్నది. అయినను నిచట విశేష్యవాచకమగు కామ శబ్దము ప్రయుక్తము కాలేదు. విశేషణ వాచకమగు కుసుమాయుధ శబ్దమొకటియే విశేషణ విశేష్యములను రెంటిని తెలుపుచున్నదిగదా! అటులే, పినాకపాణి శబ్దమొక్కటియేయున్నను, అర్థ విశేష ప్రతీతికి లోపము రాదుగదా! అపుడు హరశబ్దప్రయోగము పునరుక్తి దోషము నేల యాపాదింపదు ?

సమాధానము:- "కుర్యామ్" అను క్రియాపదమునందలి యుత్తమ పురుషైకవచన ప్రత్యయము "నేను" అను నర్థమును తెల్పును. 'నేను' అనగా నిచట మన్మథుడే. కావున, మన్మథపదమిచట లేదనుట పొసగదు.

వేఱొక యుదాహరణము:-

"నిర్యాయ విద్యాథ దినాదిరమ్యాత్
బింబాదివార్కస్య ముఖా న్మహర్షేః,
పార్థాననం వహ్నికణావదాతా
దీప్తిః స్ఫురత్పద్మ మివాభిపేదే"

అర్థము:- అథ—తరువాత, వహ్నికణావదాతా=అగ్నికణములవలె ప్రకాశించు, విద్యా=ఐంద్రమంత్ర రూపమగు విద్య, దినాదిరమ్యాత్=ప్రాతఃకాలమున నందముగానున్న, అర్కస్య బింబాత్ ఇవ=సూర్యునియొక్క బింబమునుండివలె మహర్షేః, ముఖాత్=నారదమహర్షి యొక్క, ముఖమునుండి, నిర్యాయ=వెలుపలికివచ్చి, దీప్తిః=సూర్యకాన్తి, స్ఫురత్ పద్మమ్ ఇవ=ప్రకాశించు పద్మమునువలె, పార్థాననమ్=అర్జునుని ముఖమును, అభిపేదే=ప్రవేశించెను. నారదమహర్షినుండి అర్జునుఁడు మంత్ర విద్యను గ్రహించినాఁడని భావము.

వివరణము:- ఇచట మహర్షి ముఖార్క బింబములకు, విద్యా దీప్తులకు, పార్థానన పద్మములకును ఉపమేయోపమాన భావమున్నది. ఈ యుపమానోపమేయ భావమును తెలుపుటకు, ఒక "ఇవ" శబ్దమే చాలును- "అర్కబింబమునుండి, కాన్తి, పద్మమునువలె, మహర్షి ముఖమునుండి వెలుపలికి వచ్చి, పిదప, పార్థాననమును పొందెను'' అని చెప్పుచో నన్నిటికిని నుపమేయోపమాన భావము సిద్ధించును. అయినను మఱియొక 'ఇవ' శబ్దమును ప్రయోగించుట వలన పునరుక్తి వచ్చినది. రెండు వాక్యార్థములకు పోలికను తెలుపఁదలచినపుడొక ఇవ శబ్దమే చాలును. పై శ్లోకమున వాక్యార్థౌపమ్యమే వివక్షితము. అందుచే నొకఇవ శబ్దము చాలును. అట్లుగాక, పదార్థములకు పోలికను చెప్పుటయే వివక్షితమని యందురేని, 'విద్యా దీప్తిః ఇవ' అని మూఁడవ ఇవ శబ్దము కూడ నుండవలయును. కావున నేవిధముగఁ బరిశీలించినను నిచట దోషమే కనుపడును. వాక్యార్థోపమకవకాశమున్నప్పుడు, పదార్థోపమ నంగీకరించుట న్యాయము కాదు. అందుచే నిచట వాక్యార్థోపమలే యంగీకరింతము. పునరుక్తి దోషమును తొలఁగించుటకై "స్ఫురత్పద్మ మభిప్రపేదే'' అని పాఠమును సవరింతము.

మఱియొక యుదాహృతి:-

"దినే దినే సా పరివర్ధమానా లబ్ధోదయా చాన్ద్రమసీవ రేఖా
పుపోష లావణ్యమయాన్ విశేషాన్ జ్యోత్స్నాన్తరాణీవ
కలాన్తరాణి.''

అర్థము:- లబ్ధోదయా=పుట్టి.(ఉదయించిన యని చన్ద్రకళకన్వయించినపుడు చెప్పవలయును.) దినే దినే=ప్రతి దినము, పరివర్ధమానా=వృద్ధిపొందుచున్న, సా=ఆ పార్వతి, చాన్ద్రమసీ రేఖా ఇవ= చన్ద్రకళవలె, లావణ్యమయాన్=లావణ్యమధికముగాఁగల,విశేషాన్=

అవయవములను, జ్యోత్స్నాన్తరాణి=కాన్తియందు న్తర్గానమునొందిన (కాన్తిచేఁ గప్పఁబడిన)కలాన్తరాణి ఇవ=ఇతర కళలనువలె, పుపోష=పోషించెను.

వివరణము:- ఇచటఁగూడ 'లబ్ధోదయా, దినే దినే పరివర్ధమానా, సా, చాన్ద్రమసీ, రేఖా, జ్యోత్స్నాన్తరాణి కలాన్తరాణి ఇవ, లావణ్యమయాన్ విశేషాఁ, పుపోష, అనియొక ఇవ శబ్దమునే ప్రయోగించి వాక్యార్థోపమను చెప్పవచ్చును. రెండవ ఇవశబ్దముం డుటచే పునరుక్తి వచ్చినది.

మఱియొక యుదాహృతి:-

"యం సమేత్య చ లలాటలేఖయా యుంజతి స్సపది శంభు విభ్రమమ్
చండమారుతమివ ప్రదీపవత్ చేదిపస్య నిరవాత్ విలోచనమ్"

అర్థము:- లలాటరేఖయా=నుదుటియందున్న రేఖచే, శంభు విభ్రమమ్=శివునియొక్క విలాసమును, యుంజతః=కలిగియున్న చేదిపస్య=శిశుపాలునియొక్క, విలోచనమ్=కన్ను, యమ్=ఏ శ్రీకృష్ణుని, చండమారుతమ్ ఇవ=పెద్దగాలినివలె, సమేత్య=పొంది, ప్రదీపవత్=దీపమువలె, నిరవాత్=నశించెనో (ఆరిపోయెనో).

ఇచట "ప్రదీపవత్" అనునపుడు, వలె అను నర్థమునుచెప్పు వత్ ప్రత్యయము పునరుక్తము. చండమారుతమివ అను నపుడున్న ఇవశబ్దమొకటియే చాలును. "దైపమర్చిరివ చండమారుతమ్" అని మార్చినచో నీ దోషము పోవును.

వేఱొక యుదాహరణము:-

"నవ చంద్రికాకుసుమ కీర్ణతమః కబరీభృతో మలయ జార్ద్రమివ
దదృశే లలాట తటహారి హరే ర్హరితో ముఖస్య హిమరశ్మిదలమ్"
(సశేషము)

వ. ఇవ్విధంబున నవ్విమలాన్వయంబున నూర్జిత కీర్తి లక్ష్మీశు
లనేకులు పుట్టిరట్టియెడ, 38

చ. ప్రభవము నొందె దొడ్డజనపాలుఁడు నిర్జరవాహినీ మహో
రభటి విజృంభణ ప్రకట (రమ్యవిభాసుర) సుప్రసన్నతా
విభవవచో విశేషపదవీపరిణద్ధగతి ప్రసిద్ధ స
త్ప్రభకవిగేయమానసుఁడు చారువిశాలగుణానుకూలుఁడై. 39

సీ. (ధరణి సంభరనైక) కరశాలికర శాలి
 రఘుగోత్ర జలనిధి (రాజమూర్తి)
ధీ వాస సత్యోక్తి జయవైభవముల
 గురు భీమ బలహరి హరినిరూఢి
వాస బాణాగ్నేయ వర్ధర్మ రక్షణ
 ఘనసూదనకవి నాశనసమాఖ్య
ధనురయ సేచనాతరళా (క్షీమారుఁడు)
 బుధ మరుద్గంగాంగ భూ విభూతి

గీ. పొగడ నెగడు నిఖిల భూస్థలినానమ
త్సకల రాజమౌళి మకుట రత్న
ముకురలబ్ధ బింబ వికసత్పదాబ్జాత
సలలితుండు దొడ్డజనవిభుండు 41

చ. అతనికి లోకపాలకుల యంశమునన్ భువనైక వైభవో
న్నతిఁ దగ జన్నమాంబవలనన్ జననంబు భజించె నల్లడ
క్షితిపతి యుగ్రవిక్రమ విశేష విభూష భుజస్థలీ సమ
న్విత శితహేతి పాతిత వహిష్ఠ విరోధి వరాధియోధనై.

సీ. పెద్దకోమటి వేమ పృథివీశు వెనుసూది
యతని సంపదలెల్ల నపహరించె
గౌడాధిపతిఁ గల్చి గజపతిదళవిభా
శాఖ్యాన బిరుదంబు నలవరించె
ఒడ్డాదివిభుఁ దోలి యేఁగి వాని యిండుల
పట్టులఁ ద్రివ్వించె బలువు చెలువు
ధారాసురత్రాణుఁ బోర నిర్జితుఁ జేసి
కొల్ల వట్టించెఁ దద్ఘోటకములఁ
ఆ. గేవలుఁడె తురంగరేవంతుఁ డవఘళ
రాయమానమర్ద రాయరాంక
దీవ్యమాన నిమ్మ్రితీక ప్రతాప వి
హారి దొడ్డవిభుని యల్లశౌరి. 42

క. అల్లవిభుకీర్తి విభ్రమ
ముల్లసిలున్ సాంధ్యనాట్యయుత శర్వాణీ
వల్లభ జటాగ్రనట దు
త్ఫుల్ల ధునీధూర్తలహరి ధూర్ధరలీలన్. 43

సీ. త్యాగప్రకారంబు పాణిగొడ్డంబుగాఁ
జెలఁగు ఖేచర రాజుఁ జెప్పనేల
బాహావిజృంభణంబు బకభంజనంబుగా
నెసఁగు మరుత్సూను నెన్ననేల
విక్రమం బర్గిత్వవిధి నిరూఢంబుగా
నెగడు నారాయణుఁ బొగడనేల
ప్రాభవం బఖిల గోత్రప్రబాధకముగాఁ
దనరు సురాధీశుఁ దడవనేల

గీ. యనుచుఁ గొనియాడుచుందురు రఖిలజనులు
నిష్కలంక విభాస నిర్జిద్రి భద్రి
గుణపరంపరా రత్నభూషణవిభా స
మన్వితుండగు దొడ్డయ యల్లవిభుని. 44

మ. భరితశ్రీసిద్ధి యమ్మహీరమణు దొప్పం జోళభక్తిక్షితీ
శ్వరపూనుండగు భీమలింగ మనుజేశ శ్రేష్ఠు సత్పుత్రి భా
స్వరకారుణ్యదశా జనావన విధాసంధాత్రి వేమాంబికన్
వరియించెన్ బతిభక్తిగౌరవదృఢ వ్యాపార సత్యాంబికన్. 45

సీ. అఖిలబంధువులకు ననయం బభీప్సిత । ము లొసంగు ... ...
దనపుట్టినిల్లు సొచ్చినయిల్లు వర్ధిల్ల
నాది గర్భేశ్వరి యగుచు వెలయు
ముంగిలి మెఱుఁగని ముద్దరాలని తన్ను
బుధులెల్లఁ గొనియాడఁ బొలుపు మిగులు ......౪౬

క. ... ... పరిశ్యకపులున్ । ధీరతులు దొడ్డయాన్న కు
మారులు జనియించి రలఘు మహిమాన్వితులై ౪౭

క. అందుఁ బ్రథమోద్భవుఁడు గొమ
రొందును శ్రీరామవిభుని యొరపున జనకా
నందుఁడు ... ... శ్రీవేమవిభుఁడు ప్రస్ఫుటసరణిన్ ౪౮

సీ. బహుళ జవాభంగ భాస్వత్క్రమ తురంగ
విహరమాణ తురంగవిలసనంబు
మదనిర్ఝరావాల మహనీయశుండాల
వితతాచలోత్తరవిభ్రమంబు
మకరోత్తమవిరాజి ... ...
భూరిరయోదార వీరగుణాకార
సుభట పయః పూరశోభితంబు

గీ. నగుచు నిజబలార్ణవము మర్యాద గడచి
యన్యమండల ద్వీపము లాక్రమింప
(రవి) విభుఁడైన యల్లయవేమవిభుఁడు
... ... ... ... ...

మ. తగదా వర్ణనసేయ నల్లయసుతున్ ధాటీసకూటీక స
త్వ గణీయక్రమ ఘోటిఘోటక ఖురవ్రాతి ప్రణీత క్షితో
పగతత్త్వాక్షణ ... ... ...
సరసచ్ఛందుర్వేమేశ్వరున్. ౫౦

సీ. విమత ధరానాథవీక్షణ కుముదషం
డంబు లుద్గమవికాసంబువిడువ
పరిపంథి మేదినీపతి గర్వతిమిర సం
ఘంబులు ... ... ... ...
... ... చంద్రికౌఘంబులు ...... ...దమప్రసాదంబుదొరుగఁ
బరమహీవల్లభ బిరుద నక్షత్ర పుం
జంబులు దమప్రకాశంబు విడువఁ

గీ. బరకు నలయాచలాధర భాగ
..... ..... ..... ..... వి
జృంభణాస్తంభ నాస్తంభసరణిఁ
దనరు నల్లయవేమ ప్రతాపతరణి. ౫౧

ఉ. ఆ రఘురాముఁ డాదర సమగ్రిత లంక విభీషణున్ యశం
బార ... ... ... ...
త్తార రఘురాముఁ డాశ్రితునిసంగమభూపుని పుంగశౌరి శృం
గారపుఁగోటనిల్పెఁడా తగన్ శరణాగత రక్షణాంకుఁడై ౫౨

సీ. మత్స్యజనాధిపు మద మణఁగించి య
భంగు ... ... ...

నూఁక వరపువాస మనుఁవల్లభుఁదోలి
పల్లవ త్రినయనోద్భాసి యగుచు
నఁదాపురేశ్వరు నఖుకార్చి యూశాంధ
కార జగజ్జ్యోతి కరణియగుచు
అంపయిమ్మడి రాజసాంపు నూపెన్నిక
మన్ని కెక్కిన వేము మాడియములు
గీ. ధరణిపులగెల్చి తత్తదుద్దండ బిరుద
సముదయములెల్లఁ దన మధీనములు గాఁగ
వెలయునల్ల భూపాలక వేమ విభుఁడు
... ... ... ౫౩
సీ. (వెలయ నూరయాణమై యలరుచుండు పెనుదు)
రమున ముక్తాతపత్త్రంబుపూని
చిద్వల్లి బొబ్బిలి క్షితినాథ సుతులు సాం
పలర వింజామరములు ధరింప
మల్దిలితి క్షమామండలేశ్వర పుత్రి
లలనడి పసిడి సంబెలవహింప
సంబెటనృప తనూజ తతులు... తా
మమర హేమవ్యజనములు దాల్ప
గీ. వలిమరావనీనాథపూర్వక సమస్త
వివిధ సామంతరాజ సంభవులుదగిలి
యుభయపార్శ్వములను గొల్వనుండఁ గొలువు
విభవ జంభారి యల్లయవేమశౌరి. ౫౪
క. చటులత నల్లయవేమన
పటుధాటీ విజయభేరి భాంకృతి చెలఁగున్
బటుమథన నృహారి సమధిక
కటుకంఠగభీర (ఘోరకహాకహా) సరణిన్ ౫౫

మ. అలఘుండల్లయ వేమ భూమివిభుఁడు రాజ్యస్థాపనాచార్యుఁడై
పలరన్ మాకవరంబునందు శుభ రాజ్యప్రాజ్యగాఁ బల్లవో
జ్జ్వలవంశ్యుం బురుషోత్తమాఖ్యునిడి విశ్వస్తుత్యకృత్యంబునన్
విలసిల్లెన్ సరిమెవ్వర న్విభునకున్ విశ్వంభరామండలిన్ ౫౬

సీ. ఉక్త వేళలషోడశోపచారంబుల
శివునిచిత్తంబు రంజితము సేయు
దయతోడు . . . . . రా
నతనృపాలుర( బరోన్నతులఁ జేయు
హేమాద్రి దానక్రియా మహత్త్వంబున
విప్రుల నతిదశాన్వితులఁ జేయు

గీ. ననిన( గొనియాడఁ దరము గాదతని మహిమ
ప్రకట సింహాచలోత్తర భాగ లిఖిత
వివిధ జయశాసనాక్షర విసర నుత స
మిద్ధగుణుఁ డల్ల (విభుని) వేమేశ్వరుండు ౫౭

ఉ. తేజమెలర్ప నవ్య సుమతీధవ శేఖరుఁ డొప్పు సర్వ ధా
త్రీజనరక్షణ క్రియధురీణునిఁ దమ్ముని వీరధీమణిన్
రాజమహేంద్రి నామనగరంబునఁ బట్టము గట్టె సంచిత
శ్రీ జయకీర్తి సౌరభ విశేషవిజృంభిత దిక్సమేతుఁడై. ౫౮

వ. అప్పురంబు ప్రభూతమహిమఁ బరాభూత చక్రవాళ సము
న్నతవప్రాగ్రచలత్తారకాసముదయంబును, నతలస్పర్శ దర్శనీయతో
య పరిపూర్ణ వేష్టనస్పృష్ట విశ్వంభరావిమానంబును, నభినవసురభి వాస
నాసనాథలసత్ప్రసవవితాన రతీశ్వర శాశ్వత విభవపీఠ్య నానారామం
బును, నమంద మకరంద నిష్యంద సద్మపద్మకువలయ కుముదషండహిం
డమాన చక్రవాక చంచరీకప్రముఖ సారసపతంగ సమాజకూజనా
కలకలవాచాట సిరాఘాటకాసారంబును, నుపకంఠప్రవాహగోదావరీ

సరిన్నానిటకమలాచల శృంగసంగత కాంచన ప్రాకారప్రాసాదశిఖర మార్కండేయనాథశేఖరశశాంక నిస్రుతసుధారసప్లుత సుందరగంధవహ విహారవిగతశ్రమ పాంథలోకంబును, వినూత్నరత్నచ్ఛవిగుచ్ఛ పరంపరా సంకన్మనోహర ధర్మహర్మ్య విలసిత పరిహసితరోహణాచలకటంబును, ప్రతివత్సర వసంతమహోత్సవ నిర్భర విహార సందర్భ సముచిత వసంతరాయ రథ్యాప్రదాన విధివిధికాన్విగత తత్తత్ప్రదార్థ విశేషంబును, వేదశాస్త్రపురాణకావ్య నాటకాలంకార సాహిత్య పారావార పారంగత ధరణీ బృందారక బృందశ్రుతస్వాధ్యాయ నాదంబును, తృణకణాయిత విరోధిప్రాణ నిజార్థహారణ విహారణ శూర రాజకుమారచ్ఛలగృహీత బహుజయంత రూపంబును, బ్రతికోటి సధ ప్రతిష్ఠిత స్వర్ణకోటిలాంఛిత గృహాంగణఘణాంతరితప్రసాధిత భూరి విభవాధిక్య మాణిక్యనిరస్తనిశాంధకార వైశ్రవణ సదృశవైశ్యసమూహంబును, సదభ్రవిభ్రమసార శృంగారభాసివిలాసి విలాసినీజన మానసాపహరణ కరణకళాకళావతీవిలాస తటిల్లతాపల్లవితవర్షకాల వికాసంబును, సనల్ప కల్పనాకల్పన నానందస్పందన సముచ్ఛ్రయానంతధారాధరభరితగగనభాగంబును, నిరసితప్రభావాంఛాలబ్ధ జంగమత్వచిత్రకులగోత్ర పదారంగమదాంధగంధ శుండాలదానధారాకర్దమితవ్రజనీప్రదేశంబును, నిరర్గళ సర్గజవనతిరస్కరణ యశస్కరింఖాణ కొరట్టుముఖ్య దేశ్యవరతురంగమాలాలానంబును, నపరాలకామరావతీ సంశయ కరానన్యసామాన్యశోభనాటోపంబును నతిమతిప్రసంగ హృదయంగమరమణీయకథాతి విజృంభ సంభారధురీణంబుననగుచుఁ దేజరిల్లు నారాజమహేంద్రంబున కధీశ్వరుండు. ౫౯

సీ. అభినవ భోజాఖ్యనలరు నితండన్న
నుపమింపవచ్చునే నిపుణకలన
జగనొబ్బగండాఖ్యఁ జరియించు నితఁడన్నఁ
బురణింపవచ్చునే పురుషఘనత

భుజబలభీమాఖ్యఁ బొలుపొందు నితఁ డన్నఁ
జర్చింపవచ్చునే సత్వగరిమ
రణరంగరామాఖ్యఁ బ్రకటించు నితఁ డన్న
భావింపవచ్చునే బాణమహిమ

గీ. వనుచు నుతియింప వెలయుఁ బూర్వాస్తశిఖరి
శీతనగ సేతుమధ్యమ క్ష్మాతలేంద్ర
(ముఖ్య గర్వనిర్వాపణ) మూర్తవిజయ
భద్రగుణుఁ డల్లనృప వీరభద్రవిభుఁడు

మహాస్రగ్ధర:—శరమా కీర్తింపఁ గీర్తిస్థగితదశదిశాస్థాను నల్లాంకుసూనున్
బరభూభృత్పక్ష శిక్షాపటుచటులభుజాభాసి తారాతిసీమా
పరిలబ్ధప్రాణనాథ ప్రముదితవిమ....ద్వ్యాలికా శాలిరాగ
స్వరసంగీతప్రబంధస్వబికుడ వవవీ హాంద్రవీరావనీంద్రున్.

సీ. కుటిలత సుందరీకుంతలంబుల యందు
నలరాగములు తదాస్యములయందు
నలసత తన్మదయాన రీతులయందుఁ
జపలభావము తదీక్షణములందుఁ
గాఠిన్యగుణము తత్కుచయుగంబులయందుఁ
దనులతా త్రివళి మధ్యములయందు
విషమాస్త్రభయము తద్విరహావేళలయందుఁ
బాండురత్వము గండపాళులందుఁ

గీ. గాని ప్రజలందు నొందునుగలుగకుండ
నవనిపాలింపు పెంపునఁ బ్రబలముగను
గ్రథిత హేమాద్రిదానదీక్షాగరిష్ఠుఁ
డల్లదేవేంద్రు వీరభూవల్లభుండు.

చ. వర కమలా ప్తవంశమున వర్ణనఁ గాంచి యమోఘ మార్గణా
దరమున మించి శాంభవకథాసరణి న్మదినెంచి యుల్లస
ద్భరిత మతప్రవ ర్తన ముదంబువహించి తేన ర్తురింపుసాం
పరుదుగ రామభద్రుఁడును నల్లనృపాలుని వీరభద్రుఁడున్.

సీ. విమత కళత్ర నిర్వేదసంభవ దా ర్త
నాదముల్ పటుగర్జనములు గాఁగఁ
బరిపంథి దారసంపతదురుభూషణ
ప్రతతులు నవతటిల్లతలు గాఁగ
శాత్రవ శుద్ధాంత నేత్ర గళద్బాష్ప
సలిలపూరములు........లుగాఁగ
నహితావరోధ భావాంతస్ఫురచ్ఛోక
తరవహ్ని లవనిపాతములు గాఁగఁ

గీ. దన గదా ఖడ్గ (పటు) విమర్దనఘనంబు
సార్వకాలిక........విజృంభణంబుఁ బూను
రాజమాతుని డె యతఁడు మూ ర్తపరిభావ
వీరవిభుఁడగు నల్లయ వీరవిభుఁడు. ౭౮

చ. విహితవినోదుఁ డల్లనృపువీరవిభుండు వసంతవిస్ఫుర
ద్విహరణమాచరింప నసువీథి సితాసిత వర్ణరేణు సం
గ్రహములు నిర్ఝరీచికురరాజిఁ దలిర్చి సురాళినెల్లఁ ద
జ్జహదజహద్ద్వయోగుణ విశంకటశంక ఘటించుఁ బైపయిన్. ౭౯

సీ. తన కీర్తికాంత గుంభనము దుగ్ధాబ్ధి డిం
డీరపంక్తులకుఁ బౌణింధమంబు
తన ప్రతాపానలం బనతధరానాథ
సంతతులకు లలా (టంతపంబు)

తన కటాక్షావలోకన మాశ్రితాభీష్ట
సంసిద్ధులకును వశంవదంబు
తన వాగ్విజృంభణ ......ముదిత వా
చంయములకు. ......బు

... ... ... ... ...

గీ. (అతుల గౌతమీమధ్య దత్తాగ్రహార
ముదిత భూసురాశీర్వాద మోదుతుండు)
(నిగమ విహరణ హరికృపానియమ భూమి)
..... ..... డల్లనృపతివీరశౌరి. ౬౬

మ. అరుదారన్ సురరత్న మన్నతటి రంధ్రాన్వేషణం బాచరిం
తురు నిష్ఠీవన మాచరింపఁగఁ దలంతుర్ నీరదంబన్నఁ జం
దురుఁడన్నంబరిపాటిదక్కఁ-చనఁజూతు ర్యాచక గ్రామణుల్
ధర నల్లాధిపు వీరశౌరివలనన్ ధన్యత్వముంగాంచుటన్. ౬౭

క. అల్ల విభువీరధరణీ
వల్లభ వాక్పాథి లహరి వడి సమధిక సం
ఫుల్లన్మల్లీవల్లీ
వేల్లన్మధు మధుర లసనవిభవనిరూఢిన్ ౬౮

చ. కరిపతు లేకహస్తు లహిఁకాంతుఁడు గూఢపదుండు కచ్ఛపే
శ్వరుఁడు వినోదయుండు గరివల్లభులున్ విరసస్వభావులం
చరసి వసుంధరారమణి యల్లయవీరన రేంద్రచంద్రు సు
స్థిరభుజపీఠిఁ జెందె విలసిల్లుచు నారవితారకంబుగన్ ౬౯

ఆ. తదనుసంభవుండు దనరారు దోర్దండభూ
వలయనాథుఁ డెల్లవారుఁ బొంగ
సకల మంగళార్థ సంధానతను రాజ
శేఖరుండు రాజశేఖరుండు. ౭౦

సీ. ఘనసుధర్మానివాస గౌరవస్థితిగల్గి
యొదిగి దాఁగుటలేని త్రిదశవిభుఁడు
సంపూర్ణబహుకలా సంభృతోన్నతిగల్గి
యడఁగిపోవఁగలేని యమృతకరుఁడు
తేజోవిశేష ప్రదీపితాకృతిగల్గి
యాశ్రయాశత లేని హవ్యవహుఁడు
కమలాసదానంద సుమనోజ్ఞతంగల్గి
యంగహీనత లేని యసమశరుఁడు

గీ. వెలయుఁ గాంతాకరాలీన వివిధరత్న
కటక ఘణఘణాత్కార శృంగార ధవళ
చామరద్వయ పవనసంచలిత చికుర
నికరుఁ డల్లాడవిభు దొడ్డనృపతివరుఁడు ౭౧

మ. స్తుతిసేయందగు నల్లయేంద్రతనయున్ దొడ్డక్షమాపాలకున్
హితహేమాద్రి విశిష్టదానకలనా నిర్దిష్టనానిర్జితాం
చితపాణిన్ స్థలవీథిము త్రశిరగ్రి....ధారాపయ
స్తుతిదూర ప్రతిఘూకచోడ పకృతాంత స్త్రాపరత్నాకరున్. ౭౨

సీ. ఎడప కాగ్రహములు విడువనిన్నృపతులు
విడుతురు నిజరాజ్యవిహరణములు
సొలవ కాజ్ఞలుసేయఁజోరని భూరమణులు
చొత్తురుగ్రాచలస్థూల గుహలు
కడకఁ గప్పంబు లీఁగానినృపతులు
గాంతురు నానాస్త్రఘర్షణములు
వరుసబాదములకు వ్రాలనిజనవిభుల్
వ్రాలుదు రాజిధరాతలమునఁ

గీ. దన సముద్దండ జైత్రయాత్రాప్రతిష్ఠ
భూరిభేరీభణంకార ఘోరరవము
సఖలదిక్కులం దఘుకొత్తు నప్పుడనినఁ
బొగడనేల యల్లయదొడ్డభూపమణిని. ౭౩

శా. దిక్కన్యాధిపబాహులం దల్లదధరిత్రీనాథు దొడ్డాంకుచే
యుక్కాడ సిప్రుకోటి యూజింబడు వో నొప్పారు నాకంబులో
జక్కాకీటట దుద్దుమా ధణాధణ ఝంఝుం ధిమిం ధిద్ధిమిం
ధిక్కత్తోణక కీర్ణవాద్యములతో దివ్యాంగనోత్సాహముల్ ౭౪

సీ. శ్రీసార హారిదంత భూసారకరిదంత
శోభాభిభూతి విశుద్ధయశుఁడు
దుర్వార హృదయస్థలారాధ.....
.........మహాత్వధనుఁడు
మందారవనికాయ బృందారకనికాయ
గీతాభిశోభి విఖ్యాతయశుఁడు
గంగా తటాభంగ శృంగార ముదభంగ
సత్యానురూప విస్తారముఖుఁడు

గీ. జగతిఁ దనరు నతఁడు సగర భగీరథ
నల యయాతి రంతి నహుష భరత
పూర్వపూర్వరాజ పుణ్యాగణ్యవిలాస
ధుర్యుఁ డల్లవిభుని దొడ్డనృపుఁడు ౭౫

చ. అవిరళదానశీలుఁడగు నల్లయదొడ్డనృపాలుఁ బోలునే
కవిపరిరక్షణాత్త్వగుణగణ్యాత సాత్త్వికవృత్తిఁ దక్క శాం
భవనిధి యంతయుంగలిగి పాఱు విరోధమునందు రక్తతం
దవులఁ జరించు భావన వృథాపరిసంగతి నాత్మలోపలన్. ౭౬

మ. అరరే! యల్లయదొడ్డభూవిభుఁడు వాహారోహారేవంతుఁ డిం
పరుదారన్ వడిమూలఁగూరి కడవాహ్యాళిస్థలిన్ రాజసం
జరసింహంబను వారువంబును యదృచ్ఛాలీల దాఁటింపఁడే
తిరమై యిర్వదినాల్గుమూళ్లు నిజపుత్రైకంబు చేయెత్తుగాన్ ౭౭

క. ఇందుధరభక్తి నల్లయ
నందనుఁడగు దొడ్డధరణినాథుని సరి లే
రెందును గలియుగమందును
నందిత నియమవ్రతుండు నంబి యొకండున్. ౭౮

క. అతనికి ననుజుఁడు వినయా
న్వితరఘురామానుజుండు విశ్రుత బలసం
గతి ధర్మజానుజుఁడు ప్ర
స్తుతచరితుం డన్నవిభుఁడు సొంపువహించెన్. ౭౯

సీ. తన దానసంపత్తిఁ గనిన యాచకకోటి
యింద్రభూజముల బహిష్కరించుఁ
దన సమంచితకీర్తిఁ దనరారు దుగ్ధాబ్ధి
విభ్రమలీల నావిష్కరించుఁ
దన నిష్ప్రతీక ప్రతాప ప్రకాశంబు
భాస్కరప్రభలఁ దిరస్కరించుఁ
దన భుజాశా తాసిధారావిలాసంబు
రణజయశ్రీలఁ బురస్కరించు
గీ. ననినఁ బ్రతియెన్నవచ్చునే యలఘు జైత్ర
ధాటి ఘోటిఖురాఘాత దళితలలిత
సర్వసర్వంసహారజశ్ఛన్నజలధి
పలయుఁ డల్లయ యన్నభూవల్లభుండు. ౮౦

క. మారుఁడు నూతనమూర్తిఁ గు
మారుఁడు పటుశక్తి, లక్ష్మిమధుమాధవరా
ణ్మారుం డల్లయ యన్నకు
మారుం......ము సేయు.....కొనుముల్ ౧౧

క వీరల వంశగురుండు ను
దార గుణోత్తరుండు నగుచుఁ దత్త్వమహత్త్వ
శ్రీరుచి ఘోడియరాయ ప
దారూఢుఁడు భీమదేశికాధిపుఁ డొప్పున్. ౧౨

సీ అవిరళైశ్వర్య మహత్త్వసంపన్నత
మాశివ భాసటమలయువాఁడు
సంశ్రితరక్షణాస్థాపరిపూర్ణత
నాభామహోజ్జ్వలు ననువువాఁడు
వేదశాస్త్రాదికవిద్యానిరూఢత
వదనసరస్వతి వడుపువాఁడు
వివిధాన్న వితరణ.... ..... .....
చరణసమీక్షణ సమతివాఁడు

తగుఁ బ్రశంససేయ దండభృన్మదవిభం
జనుఁడు వినయవినతజనవరేణ్య
మణికిరీట ఘృణిసమంచిత చరణుఁడు
ఘోడెరాయ భీమగురువరుండు. ౧3

మ. నిపుణత్వంబునఁ బ్రస్తుతింపవలయున్ శ్రీవీరభద్రాచలా
గ్రిపు దివ్యాతతభర్మహర్మ్యతల జాగ్రద్వీరభద్రాఖిలే
శపదాంభోరుహభక్తి సుస్థిరరమాసంపూర్ణు భీమేశ్వరున్
ద్రిపురారీంద్రగురూత్తమాత్మభవునిన్ దేవేంద్రకోలాహలున్ ౧౪

క. ఈదృశ గురురాజ కటా
క్షాదృతసదపేక్షణ నిచయప్రాప్త విశే
షోదయ శుభవిభవబుధా
హ్లాదన హృదయునకుఁ బల్లవాదిత్యునకున్

క. శ్రీభాసికి దుర్ధర(సుయ)
శోభాసికి సరసత్వ..............
..... ..... .... ....
... ... ...ముమకుహృతికి .... ధృతికిన్

క. పంకజనేత్రునకు దయా
(సంకలితాత్మున కలిమదసంయుత) రాజా
హంకరణ విదారణని
శ్శంకునకును రాయ మీన జాలాంకునకున్

క. భాషాధవ చాతుర్యవి
శేష కళాధుర్య మణివిజృంభణ విద్వ
త్తోషణ లబ్ధయశ స్స్థిర
ఘోషవిశాలునకు జగద గోపాలునకున్

క. భర్గపదకమల నిష్ఠా
నర్గళగుణసహితునకు మహాత్తర నానా
దుర్గమహితునకు రిపుకుల
భార్గవరామునకు బాహుబలభీమునకున్

క. అల్లనృపపుత్రునకును
దుల్లలితచరిత్రునకు నుదంచితకీర్తి
ప్రోల్లసితామరధుని రం
గల్లహరికిఁ బాండ్యరాయ గజకేసరికిన్

వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధియుం బుత్రపౌత్రాభివృద్ధియుఁ గీర్తిలక్ష్మీ సమృద్ధియుం గానాఁ రచియింపంబూనిన కథాక్రమం బెట్టిదనిన

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

శాశ్వతాధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసిక సమ్రాట్టు

శ్రీ బంగారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోశా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యా, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, పౌరాణికకవిచంద్ర)
5. శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితావిశారద)
6. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
7. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
8. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
9. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు
10. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
11 శ్రీ వేదుల రామచంద్రకీర్తి, బి. ఏ. (హానర్సు)
12. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
13. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఎ., బి. ఎల్.

పత్రికా సంపాదకుడు

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

## ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణములు

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | |
|---|---|---|
| 1వ సంపుటము | .... | రు 6—0—0 |
| 2వ సంపుటము | .... | 6—0—0 |
| 3వ సంపుటము | .... | 6—0—0 |
| 4వ సంపుటము | .... | 6—0—0 |
| 5వ సంపుటము | .... | 10—0—0 |
| 6వ సంపుటము | .... | 10—0—0 |
| 7వ సంపుటము | .... | [ముద్రణములో నున్నది] |

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటివిషయ మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది వెల రు 1—50.

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము. మూల్యము. రు 2—50.

ఆంధ్రసాహిత్యపరిషత్తు,
కాకినాడ.

Printed by J. Gopalam, B.A., L.T., at Republic Press, Kakinada
Edited by **C. PAPAIAHSASTRY**
Published by Andhra Sahitya Parishat, Kakinada.